ఓం

శ్రీరస్తు

# గీతాస్రవంతి




గ్రంథకర్త :

సహజకవి, కవిశేఖర

యామన బసవయ్య, B.A., B.Ed.,

రిటైర్డు టీచర్

సిగడాం, శ్రీకాకుళం జిల్లా

పిన్ : 532 148

ప్రథమ ముద్రణ : 1997

ప్రతులు : 750

ప్రాప్తిస్థానము :

యామన బసవయ్య, B.A., B.Ed.,
రిటైర్డు టీచరు
సిగడాం, శ్రీకాకుళం జిల్లా
పిన్ : 532 148

వెల : అమూల్యము

ముద్రణ :
ఫోన్ : 22255
శ్రీ రామకృష్ణా పవర్ ప్రింటింగ్ వర్క్సు,
శ్రీకాకుళం
పిన్ : 532 001

ఓం

శ్రీ ర స్తు

# గీ తా స్ర వం తి



రచయిత

జననం : తేది **13-2-1923** మహాశివరాత్రి

గంగువారి సిగడాం, శ్రీకాకుళం జిల్లా

# గ్రంథకర్త పరిచయము

శ్రీవత్స గోత్రాన జెలువొందు యామన
వంశోద్భవుండయి వాసిగనిన
అప్పయ్య. రామమ్మ నర్ధాంగిగాకొని
పుత్రపౌత్రుల గాంచె పొందుగాను
అతని పుత్రులయందు అగ్రజుండై పుట్టి
అధ్యాపకుండయి యలరి నేడు
విశ్రాంతి గొనువేళ విభుదులు మెచ్చంగ
భక్తిమార్గంబున బరగునట్టి
రచనలను కొన్ని సల్పితి రమ్యముగను
భవహరంబును కొఱకును భక్తితోడ
వసుధ ''గీతా స్రవంతిని'' పరగ నేడు
తెల్పినాడను బుధజనుల్ తృప్తినొంద.

## అంకితము

వరయుత తిరుమలవాసా
గురుతుగ నంకితము గొనుము గోవిందహరీ!
పరమాత్మ నిన్ను గొలిచెద
కరుణను ననుగావుమయ్య గాన విలోలా!

# ముందు మాట

మహా భారతము పంచమవేదముగా ప్రసిద్ధి కెక్కినది. ఇది సమగ్ర బోధనకు తోడ్పడు మహా గ్రంథము. అట్టి భారతమునందు భీష్మ పర్వములో భగవద్గీత చెప్పబడినది.

'తదిదం గీతాశాస్త్రం సమస్త వేదార్థసార సంగ్రహ భూతమ్' అని శ్రీ శంకరాచార్యులువారు గీతా భాష్య ప్రారంభమున తెలిపిరి. నాలుగు వేదముల, ఐదు వందల యైదు బ్రహ్మ సూత్రముల, నూట యెనిమిది ఉపనిషత్తుల సారమే శ్రీమద్భగవద్గీత ! "సర్వ శాస్త్ర మయీ గీతా" అని స్కాంధ పురాణములో గీత శ్లాఘింపబడినది.

ఈ గీతను శ్రీకృష్ణ పరమాత్మయే అర్జునునకు ద్వాపర యుగాంతమున అనగా కలియుగమునకు 38 సంవత్సరముల పూర్వం చెప్పినాడు. కలియుగము ప్రారంభించి క్రీ॥శ॥ 1997 సంవత్సరమునకు 5098 సంవత్సరము లయినది. కాబట్టి ప్రస్తుతం గీత వయస్సు 5136 సంవత్సరము లయినవి.

ఇంతటి మహోన్నతములైన భావములు గల 700 శ్లోకాలు ఉద్రిక్తపూరితములైన యుద్ధభూమిలో సంభాషణ పూర్వకముగా శ్రీకృష్ణుడు చెప్పుటకు అర్జునుడు వినుటకు అవకాశమున్నదా యని చాలామంది విమర్శకుల యభిప్రాయము. అందుకు కొందరు పెద్దలు సమాధానము. శ్రీకృష్ణుడు అర్జునునకు యుద్ధభూమిలో 18 మాటలు తెల్పెననియు ఆ మాటల నాధారము జేసుకొని, వ్యాస భగవానుడు సర్వులకు సుబోధకములగునట్లు ఆ 18 మాటలను 18 అధ్యాయములగ రచించి బోధించెననియు తెల్పిరి.

భగవద్గీత అన్ని కాలములకు, అన్ని దేశములకు, అన్ని మతముల మూల సూత్రములకు సంబంధించినది. విశ్వ శ్రేయోదాయకమైనది. అది దాని వైశిష్ట్యము. అందుచే భగవద్గీతను ఎందరో మహానుభావులు వ్యాఖ్యలతో సహితము రచించిరి. ఎందరో రచించుచున్నారు. ఇంకెందరో రచించగలరు. సూర్యచంద్రులున్నంతవరకు భగవద్గీత వెలయుచునేయుండును.విశ్వ మానవ సౌభ్రాతృత్వమునకు తోడ్పడును. మానవ లోకమునకున్నత భావము లందించు పవిత్ర గ్రంథము.

ఇట్టి గీతలో 18 అధ్యాయములు, 700 శ్లోకములు చెప్ప బడినవి. శ్లోకములకు దిగువ నివ్వ బడిన తాత్ప ర్యముల నాధారము జేసుకొని గీత పద్యములలో "గీతా స్రవంతి" అను పేరున యీ పాత్త్రము రచించితిని. మూలములో కొన్ని సందర్భములలో చెప్పిన విషయాలనే మరల మరల చెప్పుటచే గ్రంథ విస్తరణ జరుగునను నుద్దేశ్యముతో 700 శ్లోకముల భావములను 584 గీత పద్యములలో తెల్పి రచన పూర్తిచేసితిని.

వచనముకంటె పద్యములు కంఠస్థము చేయుట సులభము. అందులో గీత పద్యములను సుళువుగా కంఠస్థము జేయవచ్చునను యభిప్రాయముతో భగవద్గీతను గీత పద్యములలో రచించి ''గీతా స్రవంతి'' యని పేరు పెడితిని. సామాన్యులు సైతము సుళువుగా కంఠస్థము జేసి అందున్న ధర్మ బోధనలు అచరణలో పెట్టి విశ్వ శాంతికి తోడ్పడుదురని నా యాకాంక్ష.

మరియు ....

ఈ ''గీతా స్రవంతి''కి తమ యమూల్యమైన యభిప్రాయాల నొసగిన పెద్దలకు, గ్రంథమును సుందరముగ ముద్రించి యొసగిన శ్రీ రామకృష్ణా ప్రింటింగ్ ప్రెస్ ప్రొప్రయిటర్ శ్రీ కల్లాన జానకిరామరాజుగారికి, వారి ముద్రణాలయ సిబ్బందికి;

ఈ గ్రంథమునకు అన్ని విధముల నన్ను ప్రోత్సహించి శ్రీ వేవు నరశింహాచార్యులగారి కుమారుడు శ్రీ వేవు కనకరాజుగారికి మరియు ఈ పవిత్ర గ్రంథానికి భాషాపరమైన సహకారా న్నందించిన సాహితీవేత్తలు శ్రీ భూపతి నారాయణస్వామిగారికి నా యభివందనములు,

ఇట్లు,

రచయిత

ఓం శ్రీ సాయిరాం గురుదేవదత్త

# దివ్యాశీస్సులు

సత్యం, జ్ఞానం, అనంతం బ్రహ్మ. ఏది సత్యం? యావత్ విశ్వమంతా నిండి అణువణువునా పరిభ్రమిస్తూ వెలుగొందుచున్న జ్ఞానతరంగ స్వరూపమే సత్యం. అది అనంతం. అదియే పరబ్రహ్మం.

అట్టి దివ్యజ్ఞానమును, అవతారమూర్తులు, యోగులు, సిద్ధ పురుషుల ద్వారా సమాజ శ్రేయస్సుకోసమై వివిధ రూపములు అందించబడినది. భగవద్గీత కూడా పలుమార్లు శ్రీకృష్ణునిచే అందించ బడిన అత్యుత్తమ జ్ఞానగ్రంథము. భగవద్గీత దివ్యామృతపు వూట. దాని నుండి దివ్యజ్ఞానామృతాన్ని యెంత తోడినా నిరంతరం ప్రవ హిస్తూనే వుంటుంది.

భగవద్గీత, కర్మ, భక్తి, జ్ఞాన మార్గములనేకాక, లోకములో మనకు కనిపించు అన్ని మార్గములను సృజించినది. వాటిని గురించి చర్చించినది. దేనిని కాదనలేదు. అన్నిటిని సమన్వయపరచి సంఘటితపరచినది. మార్గము యేదైనా యోగము ముఖ్యమని తెలిపి నది. గీతనంతయు నుపదేశించి, పిదప శ్రీకృష్ణుడు అర్జునుని యోగివి కమ్ము అర్జునా అని ఆదేశించినాడు.

ధర్మమార్గమైన, జ్ఞానమార్గమైన, భక్తిమార్గమైన, మరి యే మార్గమైన యోగము కలిగియుండుట ముఖ్యము. యోగమనగా కలయిక. మన వ్యక్తిగత మనసును విశ్వమనసుతో అనుసంధానము చేయుట యోగము. ఇదియే మానవుని లక్ష్యము, ధ్యేయము.

భగవద్గీతకు యెందరో వ్యాఖ్యానములు వ్రాసినారు. భగ ద్గీతను వచనములో రచించినారు. పద్యకావ్యములుగా వెలువరించి నారు. ఎంతమంది యెన్ని పద్య గద్య కావ్యములుగా వెలువరించి నను, ఎప్పటికప్పుడు అది నూత్న వినూత్న సౌగంధములను వెద జల్లుతూనే వుంటుంది. "గీతాస్రవంతి" అను పేరుతో చిరంజీవి యామన బసవయ్య రచించిన యీ పద్య కావ్యము సుమధుర భరితమై, లలిత లలిత పదజాలముతో నవనీత కోమలమై హృదయ రంజకముగా నున్నది. సామాన్యులకు కూడా స్పష్టముగా భావమర్థ మగు రీతి కవితాశైలి సాగినది. చిన్న చిన్న పదములలో హృదయం నకు హత్తుకొను రీతి భక్తిభరితముగాను, మనోజ్ఞసుందరముగా కావ్యమును తీర్చిదిద్దినాడు.

చిరంజీవి బసవయ్య కృషి ప్రశంసనీయం. భక్తిప్రపత్తులు శ్లాఘనీయము. అతని హృదయము గీతాచార్యుని మందిరము, అతని మానసము సత్యసాయి దివ్యపావనా తరంగమయము.

అందువలననే శ్రీమత్భగవద్గీతను తేటతేట తెలుగుమాటల్లో సామాన్య పాఠకలోకానికి అందించినాడు. తన జన్మ చరితార్థము. చిరంజీవి బసవయ్య కలము నుంచి, ఇంకా ఇంకా మహోత్తమ గ్రంథాలు వెలువడాలని ఆశిస్తూ, ఆకాంక్షిస్తూ, ఆశీస్సులను అందిస్తు న్నాను. సకల ఆంధ్రభక్త సమాజము ఈ గ్రంథాన్ని సముచితమైన రీతిలో సమాదరించగలరని ఆశిస్తూ ఆశీస్సుల నందజేయుచున్నాను.

విశ్వమందిరం,<br>గుంటూరు,<br>తేది 11-3-95.

విశ్వయోగి విశ్వంజీ

అవదూత చింతన గురుదేవదత్త

ఓమిత్యేకాక్షరం బ్రహ్మ ధ్యేయం సర్వ ముముక్షుభిః

# శ్రీ సాయి సుధాకర పూర్ణానంద స్వామీజీ

## అభిప్రాయము

ఓం శ్రీ సద్గురు పరబ్రహ్మణే నమః

సకృద్గీతాంబసి స్నానమ్ సంసారమల యోచనమ్-అన్నట్లు గీతాగంగలో స్నానమాచరించిన తక్షణమే సంసారమను మురికినుండి ముక్తి కలుగును.

శ్రీ భగవద్గీతా మూలము సహితము శ్రీ యామన బసవయ్య గారిచే వ్రాయబడిన పద్యకావ్యము అర్యమత ప్రస్థానత్రయములో నొకటియైన శ్రీ భగవద్గీత ఈ దేశములోనే గాక, ప్రపంచములోని ఉత్కృష్ట గ్రంథములలో అగ్రస్థాన మలంకరించినది. ఉపనిషత్తులు, బ్రహ్మ సూత్రములు జనసామాన్యమునకు నలవిగానివి.

శ్రీ భగవద్గీత అట్లుగాదు, పామరులకు కూడా అందుబాటులో నున్న ఉపనిషత్సారము గీతలో గలదు, గీత సర్వశాస్త్రమయి సనాతన ధర్మ సంగ్రహము. మహాభారత యుగము వెనుక ఎన్నేండ్లు గడిచినను, ఈనాటికిని శ్రీ భగవద్గీత ప్రభావము తగ్గలేదు. నానాటికి హెచ్చుచునే యున్నది. గీతోపదేశము కేవలము జ్ఞానాధికులకే గాదు సర్వులకు ఉపకరించును. జీవన్ముక్తికి గీతాధ్యయనము సులభ సాధ్యము.

ఇట్టి యుద్గ్రంథమును తెనుగునఁజేసిన యామన బసవయ్య గారు వందనీయులు. పద్యరూపమున అనువదించినది ప్రశంసనీయం గద్యము కష్టము. పద్యములు పఠించుటకు రమ్యము; రమ్యమైన సులభశైలిలో శుద్ధముగా నున్నవి. "జతనముగా దాచి చదువుము

రత్నాల హారమిది రసికుల గళమున'' ఈ బోధరూపమైన ఆ భగవద్గీత పద్యకావ్యమును పఠించి అందలి మాధుర్యమును సర్వులు అనుభ వించుదురు గాక యని శ్రీ సాయికృష్ణ మంగళా శాసనములు.

ఈ పవిత్ర గ్రంథమును తెనుగున పద్యరూపమున అను వదించిన శ్రీ బసవయ్య రచన తెలుగు పాఠకుల హృదయముల నాకర్షించునదియై యున్నది. ప్రతిదినము ఈ గ్రంథమును పఠించి పరమశాంతిని పొందగలరని ఆశిస్తూ ....

సకల చరాచర శ్రేయోభిలాషి :

శ్రీ సాయిసుధాకర పూర్ణానందస్వామి

శ్రీ సాయిగోకుల గురుదత్త విహార్

తేది 01-01-1995. విశాఖపట్నం – 530 017



# విషయసూచిక





శ్రీరస్తు

శ్రీ కృష్ణ పరబ్రహ్మణే నమః

# గీతా స్రవంతి

## అర్జున విషాదయోగము

### తేట గీత పద్యములు

శ్రీ గణాధిపు నిరతము జేరి గొలుతు
విఘ్నములు బాపు మనుచును వేడుకొందు
భవ భయంబును బాపంగ భక్తితోడ
నెల్ల వేళల గొలుతు నా యుల్లమందు 1

## ధృతరాష్ట్రుని వాక్యము

ప్రభువు ధృతరాష్ట్రుడంతట సభకు వచ్చి
ధర్మయుత కురుక్షేత్రము ధాత్రి వెలసె
నందు పాండవుల్ కౌరవులాహవమున
నెటుల పోరిరి సంజయా! యెఱుకజెపుమ! 2

## సంజయు వాక్యము

అపుడు ~~అర్జును~~డంతట నతనితోడ
పాండు పుత్రుల సేనల పాటవంబు
వ్యూహరచనను గాంచి దుర్యోధనుండు
ద్రోణుదరిజేరిదెల్పెను వినయమునను 3

పాండువుల సైన్యమందలి బహుబలాఢ్యు
లైన భీముడు, అర్జును లంతవారు
శూరవరులును పెక్కురు వీర వరులు
యెందరెందరో గలరని యెఱుక పఱచి 4

విరటుడును కున్తిభోజుడు వీరవరుడు
కాశిరాజును, ద్రుపదుడు, గడసరియగు
ఉత్తమౌజుడు, పురజిత్తు, యురు బలుండు
చేకితానుడు, శైబ్యుడు, చేరినారు. 5

దృష్టకేతువు, అభిమన్యు, ధీరవరులు
పాండుపుత్రిలతో నుప పాండవులును
బలయుతుండు యుధామన్యు భవ్యయనుడు
సమర భూమిని నిలచిరి శౌర్యధనులు 6

వినుడు మన సేనలందలి వీరవరులు
మీరు, భీష్ముడు, కర్ణుడు, మీ సుతులును
వీరవరుడు వికర్ణుడు, భూరిబలులు
నిలచినారలు శస్త్రాస్త్రములను బట్టి 7

అపరమితమగు మన సేనలంతటికిని.
రక్షకుండుగ భీష్ముడు రణమునుండె
పాండు సేనల రక్షింప బాహుబలుడు
భీముడుండెను పత్రిభువరా ! భీతిగొలుప 8

అంత కురు సార్వభౌముడు నాహవమున
గురువరులగాంచి వారితో శరములగొని
రక్షజేయుచు భీష్ముని రణమునందు
గెలుపు గూల్పుడు మనకని పలికెనంత 9

కౌరవేశ్వరు నుత్సాహ బఱుపబూని
శంతన తనూజుడెంతయు శౌర్యమొప్ప
శంఖనాదము జేసియు సైన్యములను
ప్రోత్సహించెను రణమున పోరుసలుప 10

దశదిశలు మారుమ్రోగంగ తప్పెటలను
భేరిభాంకృత ధ్వనితోడ భీష్మునకును
నండగా నిల్చి కురుసేనలన్ని యొక్క
మొగిని దలపడ దలచిరి పగను బూని 11

తెల్లగుఱ్ఱములను బూన్చు తేరుపైన
సవ్యసాచియు కూర్చుండ సారథిగను
అచ్చుతుడునుండ నిరువురు నవనివడక
శంఖనాదముల్ జేసిరి శౌర్యమొప్ప 12

పాంచజన్యము శౌరియు. పార్థుడంత
దేవదత్తము. భీముడు దిటవుగాను
పౌండ్రకంబులపూరింప. పార్థివుండు
ధర్మజుడనంత విజయము దాల్చిబూనె 13

వర సుఘోషము పూరించె ధరనకులుడు
పట్టెమణిపుష్పకంబును బహుముదమున
పరగ సహదేవుడట గల పార్టివులును
పూరణముజేసి శంఖముల్ పొల్పుగాను 14

## అర్జున వాక్యము :-

అస్త్రములు చేతబూనియు అర్జునుండు
సమరమును జేయ తలపెట్టి శత్రువులలో
ఎవరితో పోరవలయునో యెంచిజూతు
కృష్ణ! రథమును నిల్పుము కీర్తి వెలయ 15

## సంజయ వాక్యము :

రెండు సేనల మద్యను దండి బలులు
భీష్మ ద్రోణులు నుండెడి భీకరమగు
సమర భూమిని రథమును శౌరి నిలిపె
ననియు దెల్పెను సంజయు డటవిభునకు 16

సవ్యసాచియు నటగనె శత్రువులలో
తాతలను. మేనమామల. తన గురువుల
అన్నదమ్ముల. కొడుకుల. నాప్తులైన
బంధుమిత్రులగాంచియు బాధనొంది 17

## అర్జున వాక్యము :—

అచటగల బంధు హితులను అర్జునుండు
గాంచి పలికెను కేశవా! కరము నుండి
జారెగాండీవ మనుచును వీరవరుడు
మదిని చింతించి తెల్పెను మాధవునకు 18

బంధు జనులను గాంచియు పార్ధునకును
తనువు కంపము నొందంగ ధనువు విడిచి
రాజ్యమును పొందగోరియు రణము నందు
నెటుల జంపుదు వీరల నెఱుక పడదు 19

నన్ను జంపదలంచిన నాకు కీడు
గలుగ జేయగ దలపడు కౌరవులను
రాజ్య సుఖముల నాశించి రణము నందు
నెటుల బరి మార్పు గలనయ్య యెంచిచూడ 20

కౌరవులు దుష్టులైనను కదనమందు
వారలను జంపగారాదు, పాపులైన
వారి పాపము లన్నియు పట్టిచూడ
మనకు జేరును గాదయ్య మాన్యచరిత! 21

బంధు హితులను గూల్చియు బవరమందు
సంపదలు పొందగోరను శౌరి వినుము
స్వర్గ సుఖములనైనను, సకలమైన
భోగములు పొందగోరను భువిని తలప 22

రాజ్యకాంక్షను మదినెంచి రణము జేయ
దలచు దుర్యోధనాదులఁ ధరణి గూల్చి
వారు జేసిన తప్పులు వాసుదేవ
మనము జేయుట తగునయ్య మాన్యగుణుడ! 23

కులము వారలు నశియింప, కులమునందు
ధర్మ మదియంతరించి, యధర్మ మిలను
వ్యాప్తి జెందదె మాధవా! యరసి జూడ
స్త్రీలు చెడిపోదురనునది స్థిరముగాదె 24

వర్ణసంకర మేర్పడు వసుధలోన
సంకరము జేయువారికీ, సంకరమున
జనన మొందినవారికి, శౌరి తలప
నరకలోకము తథ్యము నగధరయని 25

శ్రాద్ధములు తర్పణంబులు సంకరమున
పుట్టువారలు నొసగిన పూజ్యులైన
పితృదేవత తతికని పెంపుగాను
ఎటుల జేరును కేశవా! యెంచిచూడ 26

జాతి ధర్మము నశియించు భూతలమున
కులము ధర్మముల్ భువిలోన కూలబడును
నరులు శాశ్వతమైనట్టి నరక మందు
బడుట తథ్యమటంచును పార్థుడనెను 27

కట కటా రాజ్యసుఖముల కాశపడుచు
బంధువుల జంపబూనుట పాపము గదె
ఎటుల తలపెట్టినారమో యిటుల మనము
బవరమును జేయబూనుట పాడిగాదు 28

ఆయుధంబులు బట్టక నవని నిలచు
నన్ను కౌరవుల్ గూల్చిన నాకు మిగుల
సంతసంబంచు పలుకుచు సవ్యసాచి
సమర భూమిని నిలచెను శౌర్యముడిగి 29

కలత జెందిన మదితోడ కార్ముకంబు
చేత జార్చుచు క్రిడియు చేవ దప్పి
నిలచె రణరంగమందుంచు దెలిపెనంత
సంజయుడు ధృతరాష్ట్రితోc సమరగతిని 30

జ్ఞానశూన్యుడ నగునేను రణముజేయ
ధర్మమో కాదొ తెలుపుము తత్త్వవిదుడ
సందియముగల్గె మనమున శౌరి నిన్ను
వేడుకొందును తెలుపుము విశ్వవరద! 31

శత్రివులులేని రాజ్యము జగతిలోన
చిక్కినను గాని మనమున చింతవిడదు
దాని నెట్టుల విడచుటో ధర్మవిధుడ
నాకు నెఱిగింపు కేశవా ప్రాకటముగ 32

## సంజయ వాక్యము

అనుచు కృష్ణునితో బల్కి అర్జునుండు
సమరమును మానియుండగ శౌరిగనుచు
నతని దరిజేరి బోధించె ననుచు దెల్పె
రాజునకు సంజయుండును రణముగూర్చి 33

అర్జున విషాదయోగము
మొదటి అధ్యాయము
సమాప్తము.

ఓం తత్ సత్.

శ్రీ కృష్ణ పరబ్రహ్మణే నమః

# సాంఖ్య యోగము

## సంజయ వాక్యము

కనికరముతోడగూడిన కంటినీరు
పెట్టుకొను అర్జునుగాంచి ప్రేమతోడ
మాధవుడు పల్కినట్టిది మరలదెల్పె
సంజయుండును రాజుతో సమర గతిని 34

## శ్రీకృష్ణుని వాక్యము

పాపురులు పల్కు తీరున పార్థ నీవు
అపయశస్సును గలిగించు నట్టిదైన
స్వర్గ ప్రతిబంధకము గూర్చు స్వాంతమెటుల
కలిగెనో యిట్టి సమయాన కడకు నీకు 35

తగదు నీకిది ఫల్గుణా! ధైర్యమూని
పోరుసల్పు మనంగను, పూజ్యులైన
ద్రోణ, భీష్ములపైనను దురుసుగాను
శరము లెట్టుల బఱపెద శౌరిజెపుమ! 36

## అర్జున వాక్యము

గురుజనుల గూల్చి రణమున ధరణిలోన
రుధిర పూరిత మెతుకులు కతక నేల
బిక్షమైనను నర్థించి కక్షమాని
బ్రతుక గలవాడ నంచును బ్రతిమలాడె 37

మదిని సందియ మొదవెను మనము వార్ని
చంపుదుమొ వారు మనలను చంపగలరొ
యెటుల తెలియును కేశవా! యెల్లవిధుల
రణముజేయుట సరికాదు, మనకుదేవ! 38

## సంజయ వాక్యం

అనుచుదెల్పి యు నర్జునుడాహవమున
రెండు సేనల మధ్యను రిక్తతోడ
యుద్ధమును మాని నిలుచుండ యోగివరుడు
కృష్ణుడంతట పలికెను కీర్తి వెలయ 39

## శ్రీకృష్ణుని వాక్యము

తగనివారిని గూర్చియు, దైన్యముగను
శోకమును జెంద తగునయ్య సూరిజనుత!
బ్రతికినను చచ్చిననుగాని భవ్యగుణులు
మదిని దుఃఖింపరంచును మఱియుపలికె 40

నేను నీవును మఱియును నెల్ల నృపులు
నేడు రేపును సమరాన నెల్లవేళ
లందు నుంటిమి యున్నాము వుందుమయ్య
అనుచు దెల్పెను క్రీడికి అచ్యుతుండు 41

బాల్య యౌవన కౌమార వార్ధికములు
ఎటుల గల్గునొ జీవికి యీ శరీర
మందు నట్టులె మరణము పొందు పిదప
మరల నాతడు పొందును మరొక తనువు 42

ఇట్టి విషయము గూర్చియు నెపుడు మదిని
జ్ఞాని యగువాడు నెవ్వడు మానధనుడ
తల్ప డెంతయు మదిలోన తగునె నీవు
శోకమును బొంద రణమున ప్రాకటముగ 43

శీతముష్ణము లెట్టులో భూతలముకు
వచ్చి పోవుచుండునో వాటివలెనె
కష్టసుఖములు మనకును గలుగగాదె
వాటినోర్చిన వారలే వసుధ బుధులు 44

సుఖము నందున పొంగక దుఃఖమందు
కుందకుండక నుండెడు గురుజనములు
ముక్తి కర్హులటంచును మునులు మున్ను
తెలిపినారలు అర్జునా! తేటపడగ! 45

సత్యమైనట్టి ఆత్మకు చావులేదు
ధర జనించిన దేహము దగ్ధమగును
ననుచు నెఱుగుదు రర్జునా యవని బుధులు
నిశ్చయార్థము తెలియుము నీవు కూడ 46

అవ్యయంబగు నాత్మ యీ యవనియంత
వ్యాప్తి జెందుచున్నది అట్టిదాని
నెవడు నశియింపజేయు నీ భువిని తలప
నెఱుగు మర్జున యనుచును నెఱుక పఱచె 47

ఆత్మ నిత్యము సత్యము నపరిమేయ
మగుచు వెలయును దానికి నంతమేది
అట్టియాత్మను గూర్చియు యనవరతము
చింతజేయక యుద్ధము జేయుమయ్య ! 48

ఆత్మ దేనిని చంపదు, ఆత్మవలన
నెవరు చంపంగ బడరని నెఱుగుమయ్య
ఆత్మపుట్టదు చావదు యనుచు నీవు
వాస్తవంబును నెఱుగుము వరగుణుండ ! 49

జనన మరణము లేకుండ శాశ్వతుడుగ
నెల్లకాలము లందున నుండునాత్మ
దేహము నశించిననుగాని దివ్యమైన
ఆత్మ నశింపదయ్య యీ యవని యందు 50

చావు పుట్టుగ లెరుగక జగతి వెలయు
నాత్మ తత్త్వంబు నెఱిగిన నార్యజనుడు
నెటుల నొకరిని చంపును యిలను తలప
చంపబడునయ్య నొకరిచే శౌర్యధనుడ! 5

చినిగిపోయిన పాత బట్టలను విడిచి
క్రొత్త బట్టలు ధరియించుకొనును నరుడు
అటులె శిథిలమే తనువును నాత్మ విడిచి
మరల నొక్క శరీరము మహినిఁ దాల్చు 5

ఆయుధంబులచే నాత్మ హతముగాదు
అగ్ని దహియింపలేదయ్య నాత్మ నెపుడు
నీటిచె నాత్మ తడవుదు నిశ్చయముగ
గాలి యాత్మను శోషింపజాలదయ్య 5

ఆత్మ గూర్చియు చింతింప నలవిగాదు
మనసునకు నెంత మాత్రము మాన్యచరిత
తెలియబడ దింద్రియములకు తేటపడగ
చేష్టలుడిగిన యట్టిది చిన్మ యాత్మ 5

చావు పుట్టుగ లెట్టుల జగతిలోన
దేహికినిగల్గు నట్టులె దివ్యమైన
ఆత్మకునుగల్గునంచును నందువేని
అట్టిదానికై చింతింపనగునె పార్థ! 5

జననమొందక ముందఱ జగతిలోన
కానరారయ్య ప్రాణులు కనగ, మనకు
పుట్టినంతనె కనబడి భువిని విడిచి
చనగ కానంగబడరయ్య జగతిలోన 5

మొదట కనబడ కుండగ భువిని జనన
మొందినంతనె కనబడి తుదనుకూడ
కానరాకను అవ్యక్త గతినినుండు
ధానికై దుఃఖ మొందంగ తగునె నీకు 57.

అచ్చెరువుతోడ జూచును నాత్మ నొకడు
అచ్చెరువుతోడ వినునయ్యా నాత్మ గూర్చి
వినిన జూచిన చెప్పిన మనుజుడెవడు
తెలుసుకోలేడు ఆత్మను తలప భువిని 58

అన్ని జీవులయందును నాత్మ వెలయు
అట్టి యాత్మను నెవరును నవనిలోన
చంపలేరయ్యా కావున జగతిలోన
ప్రాణులను గూర్చి శోకింప వలదు నీకు 59

క్షత్రియుండవు నీవయ్యా శౌర్యధనుడ !
రణముజేయుట ధర్మము రాజులకును
అట్టి ధర్మము విడనాడి అతనిలోన
తగునె అర్జున నీవును మిగులకుంద ! 60.

స్వర్గసుఖముల నొసగెడు సమరమవని
జరిపి సుఖమును బడయుము శౌర్యధనుడ
ధర్మమును వీడి రణమును దలపవేని
పాపమునుపొంది కీర్తిని బడయులేవు 61

ఏ మహారథులందరు యిలను నిన్ను
ఘనుడవంచును దలచిరో కడకు నీవు
సమరమును జేయకుండగ జడునివోలె
మెలగ నినువారు జూతురు చులకనగను 62

భయముచే యుద్ధభూమిని బాసి నీవు
తొలగితివటంచు నినువారు పలువిధముల
పెక్కు దుర్భాషలాడుచు పిలుతురయ్య
పిఱికిపంద వటంచును ధరణి నిన్ను

క్షత్రియుడగను జన్మించి సమరమందు
శౌర్యధనుడవు ననుకీర్తి జగతిబడసి
వైరవర్గము దూషింప వసుధలోన
బ్రతుకుటకు కంటె చచ్చుటబాగు తలప

శత్రువులచేతఁ గూలిన సమరమందు
స్వర్గసౌఖ్యముల్ గొనెదవు సంతసమున
గెలుపునొందిన రణమున కీర్తి వెలయు
భువిని సుఖములన్ బడతవు పొందుగాను

సుఖము దుఃఖము లొకటిగాజూచి మదిని
లాభనష్టములందు ప్రలోభ పడక
జయము నపజయముల నీవు సమముగాను
దలచి రణమును జేయుము ధైర్యముగను 6

ఇంతవరకును దెలిపితి సంతసమున
ఆత్మ నిశ్చయతార్థంబు నందు గల్గు
కర్మ సంబంధ యోగము కడకు నీకు
తెలుపుచున్నాను వినుమయ్య తృప్తితోడ! 6

కర్మ యోగము తలపెట్టి కడకుదానిఁ
మధ్యలో విడుచు మాత్రాన మనకునెట్టి
దోషమును లేదు అర్జునా తుదకునదియె
మనల కాపాడు సంసార వనధినుండి 6

కర్మయోగము వలనను గలుగు బుద్ధి
నిశ్చయముగాను నుండును నిర్మలముగను
కర్మవిడనాడు బుద్ధులు కలుషమగుచు
పలువిధంబులగానుండు నిలను తలప 69

స్వర్గసుఖముల కొఱకును సంబరపడి
భోగభాగ్యముల్ స్థిరమను పురుషతతికి
దేవదేవుని జేరెడు దివ్యమైన
నిష్ఠకుదరదు అర్జునా నిశ్చయముగ 70

వేదముల పూర్వభాగము లాదరమున
కర్మకాండను దెలుపును కడకు మనకు
త్రిగుణములకును నీవు నతీతుడవుగ
ఆత్మనెఱిగిన జ్ఞానిగ నగుము భువిని 71

కర్మకాండను జరుపు సత్కర్మవిధులు
పొందు సంతోషమంతయు పూజ్యులైన
బ్రహ్మనిష్ఠను పొందిన బ్రహ్మవిధులు
బడసెదరు మానసములందు బహుముదమున 72

కర్మసలుపుటయందునే కర్త వగుము
కర్మఫలములు కోరక కడకు నీవు
కర్మలను చేయబూనుము ధర్మవిధిని
కర్మలను జేయమానకు గనుము ముక్తి 73

యోగనిష్ఠను బూనుచు నుర్విలోన
నంగమును వీడి కార్యము జరుపుమయ్యా
ఫలము గలిగిన లేకున్న బాధపడక
నుండునట్టిదె యోగ మీ యుర్విలోన 74

కామ్యకర్మల వలనను గలుగనట్టి
ఫలితములకంటె నిష్కామ ఫలములధిక
మగునని యెఱిగి నిష్కామమైన కర్మ
లాచరించుచు అర్జునా యవని యందు 7

కామ్యమెఱుగని నిష్కామ కర్మపరులు
పుణ్యపాపముల్ రెంటిని పుడమినందె
తొలగజేతురు కావున తలప నీవు
ఆచరించుము నిష్కామ మవనిలోన 7

కర్మలను జేయుచున్నను కర్మఫలము
విడిచి సమరసబుద్ధితో వెలయువారు
జనన మరణముగల్గు సంసార జలధి
దాటి ముక్తినిగాంతురు పాటవముగ 77

మలినమును వీడు బుద్ధియు గలిగెనేని
వినినదానిని గూర్చియు వినవలసిన
దానిఁ గూర్చియు తలవక మానసమున
రక్తి విడనాడియుండు విరక్తుడగుచు 78

ఇంద్రియంబుల చేతను నెఱిగి మదిని
కలతజెందని బుద్ధియుగలిగి మఱియు
ధ్యానమందున స్థిరముగ మానసంబు
నిలచినదె యోగమందురు తలప బుధులు 79

## అర్జున వాక్యము

వరసమాధిన వెలసిన పరమ పూజ్యు
లెట్టులుందురు భువిలోన నెంచి చూడ
ఎటుల మాటాడు వారలు యిలను తలప
తెలియజేయుము కేశవా తేటపడగ! 80

## శ్రీకృష్ణుని వాక్యము

### —: స్థితప్రజ్ఞ లక్షణములు :—

కోరికలు వీడి మదిలోన ధీరుడగుచు
ఆత్మ తత్త్వంబు నెఱుగుచు నాత్మనందె
సంతసంబును జెందెడు శాంతియుతుడు
తలపగా స్థితప్రజ్ఞుడీ ధరణిలోన 81

సుఖము దుఃఖము సమముగా జూచువాడు
భయము కోపము ననురాగ భరితమైన
మనసు లేనట్టివాడు యే మనుజుడైన
తలపగా స్థితప్రజ్ఞుడీ ధరణిలోన 82

మేలుకలిగిన పొంగక మిక్కుటమగు
కీడు కలిగిన మదిలోన కించపడక
తనువుపై భ్రాంతి విడిచెడు మనుజుడెపుడు
తలపగా స్థితప్రజ్ఞుడీ ధరణిలోన 83

ఇంద్రియములను నెవ్వడు యింద్రియార్థ
ములను నెవ్వడు లోనికి ముడుచుకొనునొ
అతని జ్ఞానము స్థిరమగు నతడె మిగుల
తలపగా స్థితప్రజ్ఞుడీ ధరణిలోన 84

విషయములందు ప్రీతిని విడువవచ్చు
గాని, వాని వాసనలను కడకు మనల
వెంట తగులుచునుండును విడవకుండ
ఆత్మసందర్శనంబున నణగు నవియు 85

ఎట్టి విద్వాంసునైనను యింద్రియములు
లొంగదీయును, వాటికి లొంగకుండ
నన్ను ధ్యానించువారలే యెన్నికైన
భక్తవరులని తలుచుము పార్థ నీవు 86

విషయచింతన వలనను విడువనట్టి
కోరికజనించు, దానిచే కోపమొదవు
కోపమొదవ వివేకము గోప్యమగును
మఱుపుగలిగించి బుద్ధియు మఱుగుపడును

బుద్ధినాశన మగునంత బుధులు కూడ
చెడుదురనుచును దెల్పుచు చెలువమీర
ఇంద్రియముల జయించుచు నిలను వెలయు
నరుడు శాంతిని పొందును గుఱుతుగాను

నిర్మలత్వము గలిగిన నిండుమనసు
గలుగు వారల దుఃఖముల్ తొలగవారు
స్థిరముగా బుద్ధి నిల్పుచు శీఘ్రముగను
ఆత్మరతులుగ నుందురు యవనిలోన 1

ఇంద్రియములను మనసును నెవడు అదుపు
జేయలేకను నుండునో స్థిరముగాను
ఆత్మచింతన కుదరదు అట్టివాడు
శాంతి నెట్టుల పొందు నీ జగతిలోన 9

ఎదురుగా వీచుగాలిచే యెటులనావ
ప్రక్కమార్గము పట్టునో పరగనటులె
ఇంద్రియంబులతోగూడియేగు మనసు
తప్పు మార్గము పట్టును తలప ధరణి 9

జనులకేదియు రాత్రియై జగతి వెలయు
నట్టి రాత్రిని యోగియు ఆత్మగూర్చి
చింతనము జేయుచుండును స్వాంతమందు
పగలు నిద్రించు నాతడీ జగతినందు 9

జేరి నదులన్ని సమయు నటుల
ఁయములన్నియు పూర్తిగాను
వును బ్రహ్మను మనమునందు
యోగికి నిరతము నిశ్చయముగ 93

కెల్ల విడిచియు కోపముడిగి
ంకారములువీడి అహము విడిచి
ు నాతడు శాంతిని మెండుగాను
ంచును తెలియుము పుడమినందు 94

సంబంధమైనది పరగదీని
వాడెల్లవేళల తృప్తిగనును
కాలమునందున నాత్మరతిని
నాతడు మోక్షము పొందునయ్య 95

సాంఖ్య యోగము
రెండవ అధ్యాయము
సమాప్తము.

శ్రీకృష్ణ పరబ్రహ్మణే నమః

# కర్మయోగము

## అర్జున వాక్యము

జ్ఞానమే కర్మకంటెను ఘనమటన్న
యుద్ధమను కర్మనందు నిబద్ధుడగుము
ననుచు బోధింప తగునయ్య ఆర్య నీకు
కేశవా ! యంచు పలికెను కిరీటి మఱియు 96

మిశ్రమగు వాక్యమును దెల్పి మిగుల నన్ను
కలవరము పెట్టుచుంటివి కాదె కృష్ణ
జ్ఞాన కర్మలలోనెద్ది దానివలన
పొందగలనయ్య శ్రేయము పూజ్య చెపుమ ! 97

## శ్రీకృష్ణుని వాక్యము

జ్ఞానులకు సాంఖ్యయోగము మానధనుడ !
యోగులకు కర్మయోగము బాగుననుచు
రెండు విధముల దెలిపితి దండిగాను
తెలియు మర్జున యనుచును తెలిపె మఱియు 98

కర్మలను నాచరింపక కడకు నెవడు
మోక్షమును పొందనేరడు భువిని తలప
కర్మలను మాత్రమొనరించి కర్మఫలము
మదిని కోరనివాడీల మాన్యగుణుడు 99

ఒక్క క్షణ కాలమందైన నుర్వి లోన
జనులు కర్మలు విడనాడి మనగగలరె
ప్రకృతి వలన జనించెడు బంధములను
త్రెంచుకొనలేము కర్మను త్రెంచి భువిని 100

కఠినముగ నింద్రియంబులు కట్టిపెట్టి
విషయచింతలు మనమున విడువకుండ
తలచువారలు మూఢులు ధరణి తలప
కపటచిత్తులువారలు కలుషమతులు 101

ఇంద్రియములను మనసుచే నెల్లవిధుల
నణగద్రొక్కియు కర్మను నాచరించి
సంగరహితుడుగా నుండు నదమలమతి
ధరణి నుత్తముడనుచును దలుపుమయ్య! 102

నియమితంబైన కర్మను నెల్లవిధుల
చేయుచుండుట శ్రేష్ఠము జీవికెపుడు
చేయకుండగ నుండెడి జీవికెటుల
దేహయాత్రయు సిద్ధించు తృప్తిగాను 103

లోకహితమగు కర్మలు ప్రాకటముగ
జనులు బంధింపనేరవు జగతిలోన
ఇతర కర్మలు నరులను నెల్లవిధుల
పట్టి బంధించుచుండును పార్థతలప 104

మునుపు బ్రహ్మ వచించెను వినుమ పార్థ!
యజ్ఞములవల్ల మనుజులు యవనిలోన
సృష్టిగావింపబడిరని స్పష్టముగను
తెలియజెప్పుచు యజ్ఞముల్ సలుపుడనియె 105

యజ్ఞములవల్ల సురలును యమితమైన
తృప్తినొందియు మనకు సంతృప్తి గలుగ
వర్షములు నిచ్చి బ్రోతురు వసుధలోన
గాన! ఉభయులు శ్రేయంబు గాంతురయ్య 106

జన్మములవల్ల దివిజులు సంతసిల్లి
ఇష్టకామ్యార్థముల నిత్తురెల్లపుడును
తిరిగి వారికి నర్పింప మఱచు నరుని
ధరణిలో దొంగయనుచును దలపవలయు

భగవదర్పణ జేయగా మిగిలినట్టి
సత్వ ధార్ణము తినునట్టి సజ్జనుండు
పాప ఫలితము నొందడు పరగభువిని
అట్లుచేయని నాతడు యఘము నొందు 1(

బ్రహ్మవలనను వేదముల్ వసుధ వెలసె
వేదములవల్ల యజ్ఞముల్ వెలసె భువిని
యజ్ఞములవల్ల వానలు యవని కురిసె
వర్షములవల్ల అన్నము బడసినాము 10(

అన్నగతమున ప్రాణులు యవనిపుట్టె
నేనుచు తెలియుము, బ్రహ్మంబు యజ్ఞమందు
వెలసినంతట వ్యాప్తినిగలది యనుచు
తెలియు మర్జున మదిలోన తేటపడగ 110

ఆత్మ యందున క్రీడించి ఆత్మ యందు
తృప్తినొందుచు నాత్మలో దీప్తి వెలయు
సంతసము నొంధు జ్ఞానికి జగతియందు
చేయదగినది లేదయ్యె ధీయుతుండ 111

అట్టి జ్ఞానియు వసుధలో నర్థమైన
కర్మవల్లను లాభంబు గాంచబోడు
కర్మ విడనాడ నష్టము గలుగకుండు
అశ్రయింపడు దేనినీ యవని నతడు 112

ఫలము కోరక కర్మను సలుపువాడు
మోక్షమును నొందుననుచును మున్ను బుధులు
తెలియజెప్పిరి అర్జునా! ఫలము విడిచి
కర్మజేయుము నీవు సద్ధర్మ విధిని 113

కామ్యమును వీడి నిష్కామ కర్మ సలిపి
జనకుడాది మహాత్ములు జగతిలోన
గనిరి ముక్తిని నీవును కర్మ సలిపి
జనుల ధర్మజ్ఞులను జేసి గనుము కీర్తి 114

గొప్పవారేమి జేతురో గుఱుతుగాను
ఆచరింతురు దానిని ఆర్యజనులు
అందువలనను కర్మను నాచరించి
ధర్మమును నిల్పుమయ్య యిద్ధరణిలోన 115

మూడు జగములలో నాకు పొందగోరు
నట్టిదేదియు లేదయ్య అయిన నేను
కర్మలను జేయుచుంటిని గాంచి నన్ను
కర్మలను జేసి జనులును ధర్మమెఱుగ 116

నేను కర్మలు చేయక మానితేని
నరులు చెడుదురు కర్మలు ధరణి విడిచి
అందువలనను సంకర మవనిగల్గు
దానికిని కారణమునౌదు తలప నేను 117

ఫలము గోరుచు న్నజ్ఞానపరులు భువిని
కర్మలను చేయుచుందురు ఘనముగాను
ఫలము కోరక జ్ఞానులు సల్పుచుందురి
కర్మలను లోక శ్రేయస్సు కాంక్షతోడ 118

ఫలము కోరుచు కర్మలు సలుపువారి
బుద్ధులను మార్చ తలపక భువిని జ్ఞాని
తనదు ఆచరణను జూపి ధరణి జనుల
తీర్చిదిద్దుట శ్రేయంబు ధీరచరిత ! 119

ప్రకృతివలన జనించిన ఫలితములను
తాను జేసినయట్లుగా దలచి నరుడు
అహము పెరుగ వివేకము నంతరించ
జ్ఞానశూన్యుడై వెలయు నీ జగతిలోన 120

గుణము, కర్మలు విభజించి మనసునందు
ఇంద్రియంబుల శబ్దాది విషయములను
తగిలియున్న వటంచును తలచి జ్ఞాని
కర్మలను జేయు భువిని నిష్కల్మషముగ ! 121

ప్రకృతివలన జనించిన రాజసాది
గుణగణముచేత మోహము మనమునందు
పొందియున్నట్టి అల్పుల డెందములను
మార్చ తలపగ రాదయ్య మహిని జ్ఞాని 122

కర్మలను నాకు నర్పించి కలుషముడిగి
చిత్తమందున నధ్యాత్మ చింతగలిగి
ఆశ, మమకారములు వీడి, దోషరహిత
సమరమును జేయుబూనుము సవ్యసాచి 123

శ్రద్ధ గలిగెయు నా బోధ సంతసమున
ఆచరించి యసూయయు నవల విడిచి
మెలగువారలు జ్ఞానులు తలప భువిని
కర్మలకు నాతడెప్పుడు కట్టుబడడు 124

నా సుబోధనలు వినకను, సన్నెపుడు
ద్వేష భావముతో జూచు నీచులవని
బుద్ధిహీనులటంచును భువినివారు
చెడుదు రంచును తలచుము శీఘ్రగతిని 125

జ్ఞానవంతుడునైనను జగతిలోన
ప్రకృతివలన జనించిన వికృతమైన
జన్మ సంస్కార గుణములు గలిగి మెలగు
నాతడెట్టుల నిగ్రహవంతుడగును 126

ఇంద్రియంబులచేతను నిలను మనకు
విషయ సంతతివలనడు వెలయునట్టి
ద్వేష మనురాగముల మది విడిచినట్టి
వాడు తలపంగ విభుడుడీ వసుధనందు 127

పరుల ధర్మముకంటెను ధరణిలోన
తనదు ధర్మమే మేలని తలపవలయు
మరణమైనను మేలయ్యు, మానవుండు
తానను నరించు ధర్మము మానరాదు 128

## అర్జున వాక్యము

పాపములు జేయవలెనని పరగ నరుడు
మదిని తలచకనుండియు, మఱియు భువిని
ఎందువలనను పాపముల్ పొందుగాను
చేయుచున్నాడో తెలుపుము శ్రీనివాస ! 129

## శ్రీకృష్ణుని వాక్యము

రాజసంబగు గుణము సుత్తేజపఱచు
కామ గుణమును, దానిచే క్రోధ మొదవు
అన్ని పాపంబులకు నిది ఆలవాల
మగును కామము, దానివి మదిని విడుము 130

అనుభవించిన నెంతయు నవనిలోన
తృప్తినీయదు కామము తెలియుమయ్య
మోక్ష మార్గమునకు నిది మూలమైన
శతృవని నీవు దలచుము స్వాంతమందు

పొగవలన నగ్ని, మురికిచే మిగులగాను
అద్దమును, మావిచేతను నవని శిశువు
కప్పబడు రీతి జ్ఞానమున్ కప్పి వేయు
కామమని, దాని విడువుము మానధనుడ ! 1:

అగ్నివలె తృప్తిజెందని దవనిలోన
కామమని నెఱుగు మనుచు ఆ కామ మెపుడు
జ్ఞానికిని శతృవనుచును గనుచు మదిని
కామమును వీడువాడును ఘనుడు తలప 13

ఇందిరియంబులు మనసును బుద్ధికూడ
కామమున కాశ్రియంబులు కనుక నవియు
ఆత్మ జిజ్ఞాసు నుంగప్పి యనవరతము
మోహపెట్టుచు నున్నది దేహినెపుడు 134

మొదట యింద్రియ నిగ్రహమును సలుపుచు
జ్ఞానవిజ్ఞానముల రెండు సమయున్నట్లు
జేయుచును పాపహేతువై చింతగొలుపు
కామమును వీడవలెనయ్య ఘనుడ తలప ! 135

ఇంద్రియాదులకన్నను యెంచమనసు
గొప్పదై యుండు, దానికిని గొప్పదనుచు
బుద్ధి వెలయును, దానికిని శుద్ధమైన
ఆత్మగొప్పది యందురు యవని బుధులు 136

బుద్ధికంటెను గొప్పది శుద్ధమైన
ఆత్మయనుచును నెఱిగియు అర్జునుండ
మనసు నణికట్టి బుద్ధిచే మానధనుడ
కామమును శత్రువును నీవు కాల్చవయ్య ! 137

**కర్మ యోగము మూడవ అధ్యాయము సమాప్తము.**

శ్రీకృష్ణ పరబ్రహ్మణే నమః

# జ్ఞాన యోగము

## శ్రీకృష్ణుని వాక్యము

సూర్యునకు నేను దెల్పితి పూర్వమందు
కామ్యమును లేని నిష్కామ కర్మ గూర్చి
అతడు మనువుకు దెల్పెను నాదరమున
మనువు ఇక్ష్వాకునకు దెల్పె మహితగతిని 138

ఒకరి నుండియు నొకరికి నుర్విలోన
తెలియబడినదీ యోగము తృప్తితోడ
రాజ ఋషులును నెఱిగి నుత్తేజులయిరి
అంతరించెను నేడది యవనిలోన 139

భక్తుడవు మిత్రుడవు నాకు పార్థ, నీవు
నీకు నెఱిగించితిని నేడు ప్రాకటముగ
శ్రేష్ఠమై గోప్యమగుచును శ్రేయమిడుచు
వెలయు నిష్కామ కర్మను తెలియుమయ్య ! 140

## అర్జున వాక్యము

కొద్దికాలము క్రిందటే గుఱుతుగాను
భువిని జన్మించితివి నీవు బుధవరేణ్య !
ఎపుడు సూర్యుడు జనియించె, నెటుల నీవు
తెల్పితివి యిట్టి యోగము తెలుపుమయ్య ! 141

## శ్రీకృష్ణుని వాక్యము

జగతి నాకును నీకును జన్మలెన్నొ
గడచినవి, నాడు జన్మలు ధృఢముగాను
తెలియు నాకును, నీ కవి తెలియబడవు
అనుచు కృష్ణుడు దెల్పెను అర్జునునకు 142

పుట్టకయు లేనివాడను పుడమిలోన
ప్రాణులకు ఈశ్వరుండను, వసుదనాడు
ప్రకృతి వశమును జేకొని పరగభువిని
పుట్టుచుందును నాకునే పుడమిపైన 143

ఎప్పుడు ధర్మము క్షీణించు నవుడు భువిని
నన్ను నే సృష్టి యొనరించుకొనువాడ
నగుదు, ధర్మము కాపాడి యవనిలోన
వెలయువాడను అర్జునా ! వెతలబాప

సాధుసజ్జనవరులను మోదమునను
రక్షజేయుచు దుష్టుల శిక్షజేసి
ధర్మమును నిల్ప జనియింతు ధాత్రిలోన
ప్రతియుగమునందు ననుచును నతడు తెలిపె 1

దివ్యమగు నాదు జన్మను దీక్షతోడ
నెఱిగి, కర్మను గూర్చియు నెఱుగువాడు
మఱల జన్మను నొందక మహితగతిని
మోక్షమును పొందుచుండును ముదముతోడ 1

భయము, క్రోధము, ననురాగభరితమైన
మనసు విడనాడి చిత్తము మహితగతిని
నన్ను జేర్చెడు యోగులు నా స్వరూప
మందు జేరుచు ముక్తినినొందగలరు 14

ఎవరు ఎట్టుల మదిలోన నెల్ల విధుల
దలచువారలొ నన్ను యిద్ధరణిలోన
నేను నట్టులవారల ననవరతము
గాచి రక్షించువాడను గాదె భువిని 148

కర్మఫలసిద్ధి గాంచంగ కర్మములను
నాచరింతురు మనుజులు నవనిలోన
శీఘ్ర ఫలముల నాశించి చేరి వారు
దివిజవరులను గొల్తురు దీక్షతోడ ! 149

వర్ణ సృష్టికి నేను యీ వసుధలోన
కారణమునైన, కర్తనుగాను తలప
కర్మ చేయుటవలనను గలిగినట్టి
ఫలితములు పొందగోరను పార్ధ మిగుల 150

కర్మ ఫలమును గోరక కర్మ చేయు
వారలెల్లరు ముక్తిని బడయగలరు
అందువలనను నిష్కామమనెడు కర్మ
చేయబూనుము యవనిని చింత విడిచి 151

కర్మ యెట్టిది మఱియు, అకర్మ యెట్టి
దనెడు బేధము పండితుల్ యవనిలోన
తెలుసుకొనలేరు అర్జునా! తెలియబఱతు
నీకు కర్మ రహస్యము నిశ్చయముగ 152

శాస్త్రవిహితమౌ కర్మలు, శాస్త్రరహిత
కర్మలని, యేమిచేయక, కర్మ విడిచి
ఊరకొనువారి గూర్చియు ధీరవరుడ
తెలియజెప్పెద వినుమయ్య తృప్తిగాను 153

యోగియగు జ్ఞాని నిరతము నుర్విలోన
కర్మనందు నకర్మ, యకర్మయందు
కర్మయును పొందుబఱచి నద్ధర్మ విధిని
మెలగుచుండెడు ననుచును తెలియుమయ్య! 154

మునుపు నిష్కామ కర్మను భువిని సలిపి
ముక్తిగాంచిరి యెందరో ముదముతోడ
అటులె నీవును అర్జునా! యవనిలోన
ఫలము కోరక కర్మను సలుపుమయ్య! 155

జ్ఞానమను నగ్ని చేతను సకలమైన
కర్మ ఫలములు దహియించి కర్మ సలుపు
వాని పండితుడందురు వసుధలోన
పెద్దలెల్లరు మిగుల సంప్రీతి తోడ ! 15

కర్మ ఫలములందాసక్తి కలుగకుండ
నిత్య సంతృప్తి జెందిన నిర్మలుండు
ఆశ్రయించడు దేనిని నవని నతడు
కర్మ చేసిన కర్మచే కట్టుబడడు 157

ఇంద్రియంబుల మర్ధించి, విడిచి ఆశ
ఏదియు పరిగ్రహింపక నిలను నెవడు
దేహ పోషణకై భువి దీక్షతోడ
కర్మ సలుపునొ కర్మచే కట్టుబడడు 158

సుఖము దుఃఖము సమముగా జూచి మదిని
తనకు దొరికినదానితో తనివి నొంది
బడసినను కార్యసిద్ధియు బడయకున్న
సంతసము నొందువాడు ఈ జగతి ఘనుడు 159

దేనియందును సంగములేనివాడు
ఆత్మ చింతనతో మది నలరువాడు
లోకహిత కాంక్షతో కర్మ ప్రాకటముగ
జేయు నాతడు కర్మచే చిక్కుబడడు 160

హోమ ద్రవ్యము, హోమము, హోమ ఫలము
హోమ సాధనల్, హోమాగ్ని, హోమ మవని
బ్రహ్మరూప మటంచును బరగమదిని
దలచు నాతడు పొందును ధరణి, ముక్తి 161

ఇంద్రియములచే గల్గిన వివిధములగు
చేష్టలెల్లను జ్ఞానులు స్థిరముగాను
దగ్ధ మొనరింతు రవనిలో ధర్మవిధిని
నిగ్రహంబను నగ్నిలో నేర్పు మీర! 162

దానధర్మాది క్రియలనే ధరణిలోన
యజ్ఞమని కొందఱందురు యార్యజనులు
తపముచేయుట యజ్ఞమీ ధరణి తలప
ననుచు కొందఱు తలతురు యవనిలోన 163

పరగ ప్రాణము జేర్చి నపానమందు
అల నపానము ప్రాణమునందు జేర్చి
ప్రాణగతులను మార్చెడు ప్రాజ్ఞులెల్ల
యత్న శీలురు తలపగ నవనిలోన 164

మఱియు కొందఱు ఆహారమందు తగిన
కట్టుబాట్లను గలిగియు కడుముదమున
ప్రాణవాయువులందున, ప్రాణవాయు
వులను హోమము జేయుచు మెలగగలరు 165

పైన దెల్పిన వారలు పరగభువిని
ఇంద్రియములను మర్ధింపనెంచి భువిని
యజ్ఞములు సల్పు వారలు ప్రాజ్ఞులనుచు
నెఱుగు మర్జునా వారల నెల్లవిధుల 166

భువిని యజ్ఞముల్ సలిపియు పొందుగాను
యజ్ఞశేషమై వెలసిన యమృత రూప
మైన అన్నము భుజియించు జనుడు తలప
బ్రహ్మపదమును పొందును బహుముదమున 167

వివిధ యజ్ఞములన్నియు వేదమందు
చెప్ప బడినవి యవియెల్ల చెలువమీర
కర్మ వల్లను గలిగెను గనుక నీవు
కర్మ నెఱిగిన కర్మ చే కట్టుబడవు

ధనముచే యజ్ఞ ఫలితము ధరనుపొందు
వారికంటెను, జ్ఞానంబువలన యజ్ఞ
ఫలము పొందినవారలే తలప ఘనులు
అంతయును జ్ఞానమందునే యమరియుండు

అట్టి జ్ఞానము నెఱుగుము అవనిలోన
తత్త్వ వేత్తల సేవించి, దండము లిడి
సమయమును జూచి ప్రశ్నించి శాంతమతిని
తెలియు మర్జున యని దెల్పె తేటపడగ

మరల యిటువంటి మోహము తిరిగి నీవు
పొందకయు నుండదలచిన పూజ్యులైన
తత్త్వ వేత్తలవల్లను ధరణిలోన
జ్ఞానమార్గము నెఱుగుము మానవసుత !

పాపులందరికంటెను పాపియనుచు
తలతువేనియు మనమున యిలను వెలయ
జ్ఞానమను తెప్ప చేతను బూని నీవు
పాప సంద్రము దాటుము పార్థ యనెను

కట్టెలెట్టుల అగ్ని చే కాల్చబడునో
అటుల కర్మలు యన్నియు యవనిలోన
జ్ఞానమను నగ్నివలనను ఘనముగాను
కాల్చబడునంచు తెలియుము కనుక నీవు

అవని జ్ఞానముకంటెను యధికమైన
దేదిలేదయ్య అజ్ఞానమంత యోగి
తానె తనలోన నెఱుగుట తథ్యమనుచు
నెఱుగు మర్జున మదిలోన గుఱుతుగాను 174

గురువునందును శాస్త్రవాక్కులను యందు
శ్రద్ధగలిగినవారలు బద్ధులవరు
ఇంద్రియంబుల కనుచును నెఱిగి నీవు
జ్ఞానమును పొందుమయ్య విజ్ఞానుల కడ 175

శ్రద్ధ జ్ఞానంబులందున సంశయంబు
గలుగు చిత్తముగలవాడు కడకు చెడును
ఇహపరంబుల సుఖములనెల్ల నతడు
పొందలేడని తలచుము బుధజనుండ 176

కర్మ ఫలముల విడచు నిష్కర్మ యోగి
జ్ఞానమను కత్తిచేతను సందియములు
నఱుకు నాతడు కర్మలనంటబోడు
ఆత్మనిష్ఠుండు నాతడీ యవనిలోన 177

కనుక నీవును అర్జునా మనమునందు
జ్ఞానమను కత్తిబట్టియు సంశయముల
నఱికి నిష్కామ కర్మను మఱువకుండ
మెలగు మనుచును బోధించె మిగుల ప్రీతి 178

జ్ఞాన యోగము
నాలుగవ అధ్యాయము సమాప్తము.

శ్రీకృష్ణ పరబ్రహ్మణే నమః

# కర్మసన్యాస యోగము

## అర్జున వాక్యము :

కర్మ విడుమని నొకపరి, కర్మ చేయు
మనుచు నొకపరి, తెల్పంగ మనమునందు
సందియము గల్గె కేశవా ! జగతిలోన
ఏది శ్రేష్ఠమొ చెప్పుము సాదరమున 179

కర్మ విడువాడు విడువని కర్మపరుడు
ఇర్వురును ముక్తిగాంతురు నుర్వి తలప
అందు కర్మను నలిపెడు ఆర్యజనుడు
కర్మ విడువానికంటెను ఘనుడు తలప 180

ఎట్టిదానిని ద్వేషింప కెట్టిదాని
కోరబోవడొ నాతడు ధరణిలోన
త్యాగియని చెప్ప బడునయ్య యట్టివాడు
బ్రహ్మవిదుడని తెలియుము పార్థమదిని 181

కర్మయోగము జ్ఞానయోగములు రెండు
వేరువేరని తలచెడువారు గలరు
వాటిలో నొక్కదానిని పాటవముగ
ఆచరించెడు వారలీ యవని ఘనులు 182

జ్ఞానయోగమువలనను జగతిలోన
ఎట్టి ఫలమును పొందునో యట్టి ఫలము
కర్మయోగమువలనను గనునటంచు
నెఱుగు మర్జున మదిలోన గుఱుతుగాను 183

కర్మ చేయక జ్ఞానంబు కలుగుటరుదు
కర్మయోగమువలనను కడకు నరుడు
మనన శీలుండు నగుచును మహితగతిని
బ్రహ్మపథమును బడయును బహుముదమున 184

ఇంద్రియములను మనసును నెల్లపుడును
గెలిచి తనవలె యితరుల దలచి మదిని
సమహి తత్త్వంబు నంజూచు సజ్జనుండు
కర్మలొనరింవ వానిచే కట్టుబడడు 185

వినుచు పలుకుచు నడచుచు తినుచు గనుచు
శ్వాస నిశ్వాస కార్యముల్ జరుపుచుండి
సలుపుచున్నవి ఇంద్రియములను గాని
తాను చేయుటలేదని తలచి యోగి 186

సంగమును వీడి కర్మలు సలుపువాడు
తానుజేసిన కర్మలు దైవమునకు
అర్పితము జేయునాతడీ యవనిలోన
పాపముల నంటబోడయ్య పార్ధ తలప 187

చిత్తశుద్ధిని కాంక్షించి స్థిరమతులయి
యోగివరులును నిష్కామ యోగగతిని
ఇంద్రియంబుల తోడ్పాటు తోడ నిలను
కర్మలను చేయుచుందురు గాదె తలప 188

కర్మ ఫలమును విడనాడి కర్మ సలిపి
ఆత్మనిష్ఠను పొందు నీయవనియోగి
కర్మ ఫలమును కాంక్షించి కర్మ సలిపి
కట్టుబడుదురు యితరులు కర్మవలన 189

ఇంద్రియములను యర్పించి యెల్ల కర్మ
ఫలములను వీడి యోగియు పరమశాంతి
నొందియుండును దేహమునందు ననుచు
తెలియజెప్పెను కిరీటికి తృప్తికలుగ 190

కర్మలను కర్మసంబంధ గతినిగాని
జీవులకు గల్గ జేయడు దేవుడెపుడు
వారివారల జన్మసంస్కారములచె
జీవులే పొందుచున్నారు ధీవరేణ్య 191

పుణ్యపాప ఫలంబులు పొందుగాను
జీవులే పొందుచుందురు భువిని తలప
ఆత్మ నంటవు యవి యెల్ల హర్ష మొదవ
తెలియు మనుచును దెల్పెను తృప్తితోడ 192

బుద్ధి మనసును ఆత్మసంబద్ధు జేసి
ఆత్మ పరమాత్మతో జేర్చి యనవరతము
జ్ఞాన నిష్ఠను నుండెడు ధ్యానపరులు
మోక్షమును పొందుచుందురు భూతలమున 193

శునకమందున కరిపైన సుజనుడైన
భూసురునిపైన గోవుపై బుధునియందు
పరగ చండాలుపైనను ధరణిలోన
నొక్కరీతిని నుండును నుర్వి యోగి 194

అన్ని ప్రాణుల తనవలె నాత్మ నెఱిగి
సమహితత్త్వంబుతో నుండు శాంతియుతుడు
జగతి యీ జన్మనందునే సుగతినొందు
బ్రహ్మతత్త్వంబు నెఱిగిన ప్రాజ్ఞుడతడు 195

మోహరహితుడు స్థిరమగు బుద్ధియుతుడు
ఇష్టమందును మఱియు ననిష్టమందు
సమముగా నుండువాడును సజ్జనుండు
బ్రహ్మపథమును బడయును పార్థ తెలియ 196

బాహ్య విషయములందున భ్రాంతుడుడిగి
మెలగువా డెల్లవేళల మిగుల ప్రీతి
వర సమాధిని పొందియు వసుధలోన
ఆత్మయందున సుఖియించు నవరతము 197

విషయ సంయోగములచేత వేడుకొసగు
భోగములు దుఃఖమయములు భువిని నవియు
అల్ప కాలము నిలచును అట్టివాని
యందు విజ్ఞుడు క్రీడింప డవనిలోన 198

తనువు విడువక మున్నె యీ ధరణిలోన
కామమును క్రోధమెవ్వడు కాల్చగలడొ
అతడె యోగియు సుఖవంతుడనుచు మదిని
తెలియు మర్జున యనుచును తెలిపె శౌరి 199

ఆత్మయందు సుఖించుచు నాత్మయందు
నెవడు క్రీడించుచుండునో భువిని నతడు
ఆత్మ యందు ప్రకాశించు నట్టి యోగి
బ్రహ్మమందున లీనమై బరగుచుండు 200

పాపరహితులు సంశయ వర్జితులును
ఇంద్రియంబుల మనసును నెవరు గెలిచి
ప్రాణి క్షేమంబు గోరుచు బరగువాడు
బ్రహ్మపథమును గాంతురు భవ్యగుణులు 201

ఆత్మతత్త్వంబు నెఱిగిన నార్యజనులు
కామమును క్రోధమంతయు కాల్చి పిదప
మనసు నిగ్రహ మొనరించు మాన్యగుణులు
బ్రహ్మసాయుజ్యమును పొందు పార్థ తలప ! 202

ఇంద్రియములను మర్ధించి యిలను నెవడు
చూపు భ్రూమధ్యమందున సూటిగాను
నిలిపి నాసికాపుటముల వెలయు వాయు
గతులు గనుగొనువారలు ఘనులు తలప 2(

మనసు బుద్ధియు యింద్రియ మార్గములను
నిగ్రహించియు మనుజుండు నిండు మదిని
భయము లోభము క్రోధము బడయుకుండ
నుండునాతడు ముక్తిని నొందగలడు 20

యజ్ఞ తపముల ఫలములు అన్ని నాకు
చేరునంచును దలచెడు ధీరవరుడు
లోకకర్తను నేనంచు ప్రాకటముగ
తెలియు నాతడు నను జేరు తృప్తితోడ 205

కర్మ సన్యాసయోగము
ఐదవ అధ్యాయము సమాప్తము.

శ్రీకృష్ణ పరబ్రహ్మణే నమః

# ఆత్మసంయమ యోగము

## శ్రీకృష్ణుని వాక్యము

ఫలము కోరక కర్మను సలుపువాడు
జ్ఞాని యనబడునంతియే కాని భువిని
అగ్ని హోత్రము విడిచెడు నట్టివాడు
కర్మ విడిచినవాడును కాడు జ్ఞాని 206

ఏది సన్యాసమందురో అదియె యోగ
మనుచు నెఱుగుము అర్జునా! యవని నీవు
కామసంకల్ప వశులును గానివారు
యోగులనుచును తెలియుము యుర్వి లోన 207

జ్ఞానయోగము లేకను ధ్యానయోగ
మెవడు పొందదలంచునో యిలను నతడు
కర్మ సాధనగా గొను. కడకు యోగి
కర్మ విడిచిన పొందునుగాదె ముక్తి 208

కర్మ లందున నాసక్తి కలుగకుండ
అన్ని సంకల్పముల నెల్ల నావల విడిచి
విషయ వర్జితుడగుచును వెలయువాడు
యోగివరుడని తెలియుము బాగుగాను 209

మంచి మార్గాన తనను తా పెంచవలెను
చెడ్డ మార్గాన నెప్పుడు చేరవలదు
తనకు వశమగు యింద్రియ తతి హితులును
కానివాటిని శత్రువుల్గా దలంచు 210

మనసు నెవ్వడు గెలుచు నా మానవునకు
నదియె మిత్రునిగా నుండు నవనిలోన
గెలువకుండినవానికి కీడొనర్చ
శత్రువనుచును తలచు మీ జగతిలోన 211

మనసు నిగ్రహ మొనరించి మదిని నైవడు
పరమశాంతిని నొందునా వరగుణుండు
సుఖము దుఃఖము నొకటిగా చూచునెపుడు
ఆత్మ యందున క్రీడించు ననవరతము 212

అనుభవముచేత శాస్త్రముల్ వినుటచేత
మట్టిగడ్డను రాయిని మఱియు భువిని
పరశువేదిని నొకటిగా పరిగణించు
వాడె యోగని తెలియు మీ వసుధలోన 213

పలము కోరి మేలు సలుపు వారలయందు
కోరకనె మేలుకోరెడువారలందు
శత్రుమిత్రుల నొక రీతి సమరసమున
మదిని తలపోయు నాతడు మాన్యగుణుడు 214

మనసు దేహేంద్రియాదులు మరలుకొలిపి
యోగి యేకాంతమున నుండి యెరులవలన
ఏమిపొందక ఆశను విడిచి మదిని
ఆత్మ రతియందు క్రీడించు నతడె యోగి 215

శుద్ధమగుచోట మిక్కిలి శుభ్రపఱచి
ఎత్తుగా నుండనదియును, బొత్తిగాను
పల్లముగలేని పీటను పదిలపఱచి
పైన దర్భాసనము నుంచవలయు మఱియు 216

దానిపై జింక చర్మము, దానిపైన
వస్త్రమును వేసి, దానిపై పదిలముగను
కూరుచుండియు, మనసును కుదుటపఱచి
ధ్యానమభ్యాస మొనరింప తగును. పార్థ. 217

శిరము కంఠము దేహము స్థిరముగాను
నిలిపి దిక్కుల జూడక నిశ్చలముగ
నాశికాగ్రము వీక్షించి నన్ను మదిని
దలచు నాతడు నను జేరగలడు పార్థ! 218

మితముగల భోజనంబును మితముగలుగు
నిద్రగలవాడు పొందును భద్రమైన
ధ్యాన యోగమటంచును జ్ఞానధనులు
తెలియజెప్పిరి అర్జునా తేటపడగ 219

కోరికలనెల్ల విడిచిన కోవిదుండు
మనసు నిగ్రహ మొనరించి మదిని నెపుడు
ఆత్మయందున నెలకొల్పి ఆత్మరతిని
గాంచునాతని యోగిగా నెంచవలెను 220

గాలివీచని చోటను కదలకుండ
దీపమెటులుండునో నట్లు దీక్షతోడ
ధ్యాన మొనరించు యోగియు తనదు చిత్త
మాత్మయందును నెలకొల్పి అచలుడగును 221

నిగ్రహించిన మనసుచే నెల్లపుడును
బుద్ధి యింద్రియములకును బోధపడని
ఆత్మ సందర్శనము జేసి యనవరతము
హర్షమొందుచు నుండును యవని యోగి 222

దేని దర్శన మాత్రాన దృఢమతి యయి
ఎట్టి దుఃఖముకైనను వెతనుబడక
నిత్య సంతుష్టుడగుచును నిర్మలుడయి
ఆత్మరతుడని యెఱుగుము యవనిలోన 223

ఇంద్రియములను మనసును నెల్లపుడును
నిగ్రహించియు కోరికలెల్ల విడిచి
ఆత్మయందును మనసును ననవరతము
నిలిపి శాంతిని గొనువాడు నిర్మలుండు 22

కామ క్రోధాది గుణములు కడకు విడిచి
దోష రహితుడునగుచును తుదకు నతడు
శాంతచిత్తుండు నగుచును సత్యమైన
ఆత్మ నందును సుఖియించు హర్షమొదవ 225

అన్ని ప్రాణులయందును నన్ను గనుచు
సర్వప్రాణులు నాలోన సంతసమున
మెలగి యున్నవటంచును తలచి మదిని
సమహితత్త్వంబు జరుపును సాధుజనుడు 226

భూతతతియంతు నను గాంచి ప్రీతితోడ
మెలగునాతడు యెటులున్న తలప భువిని
ఆత్మతత్త్వంబు నెఱిగిన నార్యుడనుచు
తెలియుమర్జునా మదిలోన తృప్తిగాను 227

ధరణి ప్రాణుల కష్టముల్ గుఱుతుగాను
తనకు గల్గినవానిగా దలచు నతడు
ఆత్మతత్త్వంబు నిరతము నభ్యసించు
యోగివరుడంచు నెఱుగుము త్యాగధనుడ! 228

## అర్జున వాక్యము

మనసు చపలత్వమున నేను మహితగతిని
నీవుదెల్పిన యోగము నిండు మదిని
తెలియలేకుంటి కేశవా! తెలుపుమయ్య
మనసు వరికట్టు మార్గము మరల నాకు 229

## శ్రీకృష్ణుని వాక్యము

మనసు చంచలమనదగు మాట నిజము
నిగ్రహింపంగ కష్టమునేరికైన
భువిని అభ్యాస వైరాగ్యములను బూని
మనసు నరికట్టవచ్చును మానధనుడ ! 230

నిగ్రహములేని మనసుచే నిలను నెవడు
యోగమును పొందనేరడు త్యాగధనుడ !
మనసు స్వాధీన మొనరించు మానధనుడు
బ్రహ్మసాయుజ్యమును జేరు బహుముదమున 231

## అర్జున వాక్యము :

శ్రద్ధతోగూడియున్నను చంచలమగు
మనసు నరికట్టలేనట్టి మానవుండు
యోగసిద్ధిన పొందక యెట్టి స్థితిని
పొందునో తెలియజెప్పుము పుణ్యచరిత ! 232

బ్రహ్మమార్గమునందున పటుతరమగు
శ్రద్ధలేకున్న వారలు చంచలులయి
ఇహపరంబులనందున నెల్ల విధుల
చెడినవారని తలతును శ్రీకరుండ ! 233

## శ్రీకృష్ణుని వాక్యము

మంచి కార్యము సలిపిన మానవుండు
ఎటుల దుర్గతి చెందును. యెంచిచూడ
ఇహపరంబుల నాతడు నెల్ల విధుల
శాంతి సుఖములు గొనునయ్య సహజముగను 234

యోగమందున భ్రష్టత నొందువారు
మరణమును నొందునంతనె మహితగతిని
పుణ్యలోక నివాసులై పుడమిలోన
మరల జనియింతురు సిరిగల మాన్యులింట 235

అటులగాకున్న జనియింతురి ఆర్యులైన
జ్ఞానవంతుల యిండ్లను జగతిలోన
నినుమడించిన జ్ఞానంబు నిలను పొంది
మోక్షమార్గము గాంతురు ముదముతోడ 236

తనకు తా యోగ మార్గము కనకయున్న
పూర్వ జన్మములో తాను పొందియున్న
జ్ఞానసంలబ్ధిచే తాను సత్వరమున
యోగమార్గము నెఱుగును నుర్విలోన 237

తాపసులకంటె శాస్త్రార్థ ధనులకంటె
కర్మ కాండను నెఱవేర్చు ఘనులకంటె
యోగి యగువాడు శ్రేష్టుడు నుర్విలోన
గనుక యోగివై భువిలోన గనుము కీర్తి 238

యోగులందరిలోగల యోగ్యుడైన
యెవడు నాయందు మనసును నెల్లపుడును
నిలిపి ధ్యానించు నాతడు నెల్ల విధుల
శ్రేష్ఠుడంచును తెలియుము చిత్తమందు 239

ఆత్మ సంయమ యోగము
ఆరవ అధ్యాయము సమాప్తము.

శ్రీకృష్ణపరమాత్మణే నమః

# విజ్ఞాన యోగము

## శ్రీకృష్ణుని వాక్యము :

మనసు నాయందు నిలుపుచు మఱియు నీవు
యోగయుక్తుడవైయున్న త్యాగధనుడ !
యెటుల సంపూర్తిగా నన్ను నెఱుగగలవొ
దాని నెఱిగింతు వినుమయ్య ధాత్రిలోన 240

దేని నెఱిగిన మనుజుడు దీక్షతోడ
మరల నొకదాని కనుగొన మనసుపడడొ
అట్టి జ్ఞానము నీకును హర్షమొదవ
తెలియజెప్పెద వినుమయ్య తేటపడగ 241

వేలకొలదిగ జనులలో విభుడొకడు
మోక్షసిద్ధిని యత్నించు ముదముతోడ
నట్టి విభుదులయందును నవనిలోన
ఒక్కడే నన్ను కనుగొను నుర్విలోన 242

వసుధ నా యొక్క ప్రకృతియు వరుసగాను
భూమి జలమును అగ్నియు భూతలమున
వాయు వాకాశ మనసును పరగబుద్ధి
మఱి యహంకార మనుచును ధరణి వెలసె 243

ఈ ప్రకృతి యల్పమైనది యింతకంటె
గొప్పదగు వేఱు ప్రకృతియు గుఱుతుగాను
జగతినంతను ధరియించి సుగతి నొసగు
జీవ రూపంబునైనది నీవు గనుము 244

చేతనా చేతనంబయి చెలగునట్టి
సృష్టికీ రెండు ప్రకృతులు స్పష్టముగను
కారణము నేను వాటికి కారణంబు
పుట్టుకయు చావు నావల్ల భువినిగల్గు 245

ఏదియును లేదు నాకంటె వేఱుగాను
అన్నిటికి కారణంబయి యున్నవాడ
మణులయందున దారము మసలునట్లు
జగము నాలోన నున్నది శౌర్యధనుత ! 246

జలమునందున రుచియును, చంద్రసూర్యు
లందు కాంతియు, వేదములందు "ఓం" అ
ను పదమును, నింగిశబ్దము, నుర్వి జనుల
బలము, నేనుగా నెఱుగుము పార్థమదిని 247

భూమియందు సుగంధము, భూతలమున
అగ్ని యందున వెలుతురు, అన్ని ప్రాణు
లందు ప్రాణము, తాపసులందు తపము
నేనటంచును తెలియుము నిక్కవముగ 248

జీవుల జనింపజేసెడి జీవమైన
బీజముగ నన్ను నెఱుగుము ప్రీతితోడ
బుద్ధిమంతులలో నున్న బుద్ధి నేను
ధైర్యవంతుల ధైర్యము ధరణి నేను 249

బలముగలవారి యొక్కయు బలము తలప
ఆశ యనురాగ రహితమౌ ఆత్మ బలము
ధర్మబద్ధమౌ కోరిక ధరణి నేను
అనుచు తెలియుము అర్జునా మనసునందు 250

మూడు గుణములతోడను గూడియుండు
అన్ని జీవులు నావల్ల నవతరించె
నేను వానికి వశుడనుగాను భువిని
అవియు నా వశమగుచును భువిని వెలయు 251

త్రిగుణములచేత జనులెల్ల తెలివి విడిచి
మోహ పరవశులగుచును భూతలమున
నాశరహితుడనైనట్టి నన్ను వారు
తెలుసుకొనలేక నుండిరి స్థిరముగాను 252

నా శరణుగోరువారలు నన్ను మదిని
నమ్మి కొలిచెడివారలు నాయందు మాయ
దాటగల వారలంచును ధరణిలోన
నెఱుగు మర్జున మదిలోన గుఱుతుగాను 253

పాపమును జేయువారలు పఱగభువిని
జ్ఞానహీనులు, మూఢులు, చపలమతులు
అసుర భావములుగల యవని జనులు
నన్ను జేరంగలేరయ్య సన్నుతాంగ 254

ఆపదల నున్న వారలు, తాపసులును,
ధనము, జ్ఞానముకొఱకును జనులు ధరణి
నాల్గు విధములవారలు నన్ను నెపుడు
గొలుచుచున్నారు అర్జునా కోర్కెతోడ ! 255

అట్టివారలయందున అవనిలోన
ఆత్మతత్త్వంబు నెఱుగంగ ననవరతము
నన్ను గొల్చెడు జ్ఞానులు నాకు మిగుల
ప్రీతిపాత్రులు తలపగ భూతలమున 256

ఎన్ని జన్మలు గతియించ నిలను నరుడు
జ్ఞానవంతుడై వెలయు నా మానవుండు
సర్వమును వాసుదేవుడే జగతిలోన
ననుచు తెలిసియు ననుబొందు హర్షమొదవ ! 257

పరికృతివలనను కొందఱు పఱగభువిని
విషయవాంచలతోడ వివేకముడిగి
ఇష్టకామ్యార్థ సిద్ధికై యితరమైన
దేవతల గొల్చుచుందురు తృప్తితోడ 258

ఎప్పుడే దేవతారూప మెంచి మదిని
పూజలొనరించుచుందురో పుడమినందు
వారివారికి నొసగెద వలయునట్టి
శ్రద్ధ భక్తియు నిరతంబు శౌర్యధనుడ ! 259

ఇష్టకామ్యార్థసిద్ధికై యితరమైన
దేవతల గొల్చువారలు తృప్తిపడగ
కామ్య సిద్ధులొసంగెద కడుముదమున
వారి దేవతల్ రూపాన వసుధలోన 260

అల్ప బుద్ధియు గల్గియు స్వల్ప మైన
ఫలములను గోరి ఆశతో వసుధలోన
దేవతల గొల్చువార లా దేవతలను
నన్ను ధ్యానించువారలు నన్ను జేరు 261

పాంచభౌతిక తనువుతో వసుధవెలయు
నన్ను కనుగొందురేకాని నాశరహిత
మైన నా రూపమెవ్వరు మహితగతిని
తెలుసుకొనలేక నున్నారు తలప భువిని 262

యోగమాయయు నను గప్పి యుండుకతన
యెవరికిని కానుపించక నున్న వాడ
జన్మరహితునిగా నన్ను జగతిలోన
అల్ప బుద్ధులు నెఱుగరు యని తెలియుము 263

భూతభవిషత్తులందున భువిని వర్త
మానములయందు పుట్టిన మానవులను
నేనెఱుంగుదు. వారలు నెఱుగలేరు
నన్ను యనుచును తెలియుము నమ్మి మదిని 264

ప్రాణులవనిలో జనియించు పట్టునందె
కామమును క్రోధములతోడ కలుగునట్టి
కష్ట సుఖములు కలిగించు కలుషమైన
బుద్ధి గలిగించి అజ్ఞానబద్ధుజేతు 265

పుణ్య కార్యములొనరించు పుణ్యమతులు
పాపములు తొలగునంతనె పఱగ నన్ను
గొలిచి అజ్ఞానమును వీడి కూర్మితోడ
చేరుదురు నన్ను అర్జునా శీఘ్రముగను 266

ముసలితనమును, మరణము పుడమిలోన
కలుగకుండగ దలచెడు ఘనుడు నన్ను
మదిని ధ్యానించి సర్వము మాధవుండె
యనుచు దలచును నిరతంబు ఆత్మలోన 267

అదిభూతాది దైవము అదియజ్ఞ
ములతో గూడిన నన్నును పుడమిలోన
నెఱుగువారలు నిరతంబు మరువకుండ
దలచెదరు ధాత్రి వీడెడు తరుణమందు 268

విజ్ఞాన యోగము

ఏడవ అధ్యాయము సమాప్తము.

శ్రీకృష్ణ పరబ్రహ్మణే నమః

# అక్షర పరబ్రహ్మయోగము

## అర్జున వాక్యము

బ్రహ్మమెయ్యది ? అధ్యాత్మ భావమేమి ?
కర్మమెయ్యది ? ఆదిభూత మర్మమేమి ?
పుడమి నధి దైవమెయ్యది ? పుణ్య పురుష
తలప నధి యజ్ఞుడెవ్వడు తెలుపుమయ్య ! 2

ప్రాణమును వీడు సమయాన పరమపురుష
నియమమతులకు నెట్టుల నిండుకృపను
తెలియబడువాడవయ్య యో దేవ యనుచు
అర్జునుండు ప్రశ్నించె నచ్యుతునకు 27

## శ్రీకృష్ణుని వాక్యము

నాశరహితము బ్రహ్మము దోషరహిత !
ప్రత్యగాత్మయె అధ్యాత్మతత్త్వ మవని
త్యాగపూర్వక క్రియలను ధరణిలోన
కర్మలనుచును తెలియుము ధర్మవిధుడ ! 271

నాశమగునట్టివాటిని దోషరహిత
ధరణి నధి భూతమందురు, తగహిరణ్య
గర్భు నది దైవమందురు, కడకు నన్ను
అనె దరధి యజ్ఞమనుచును యవనిలోన 272

మరణకాలమునందున మరువకుంత
నన్ను స్మరియించువారలు, నా స్వరూప
మందు చేరుదురనుటలో సందియంబు
లేదు యనుచును నెఱుగుము సాధుహితుడ ! 273

ఎట్టి భావన తోడుత నిలను నరులు
మరణమొందుచు నుందురో మరల వారు
అట్టి భావన తోడుత యవనిలోన
పుట్టెదరుయంచు తెలియుము పుడమిరేడ 274

ఎల్లకాలము నను నీవు నుల్లమందు
దలచి యుద్ధము చేయుము ధర్మవిధుడ
నన్ను నిరతము ధ్యానించు నందువలన
సందియము లేక నను నీవు పొందగలవు 275

నిరత మభ్యాస జనితమౌ నిండు మదిని
నన్ను ధ్యానించువారలు నా స్వరూప
మైన పరమాత్మనందున తనువు విడచు
కాలమును జేరెదరు వారు కలుష హరణ ! 276

అంత్యకాలము భ్రూమధ్యమందు నెవడు
ప్రాణవాయువు నిల్పుచు భక్తితోడ
పరమపురుషుని ధ్యానించు నరుడు తలప
దివ్యపథమును జేరును భవ్యగుణుడ ! 277

వేదవేత్తలు మఱియును సాధుజనులు
బ్రహ్మచర్యగరిష్టులు రాగరహితు
లెట్టిదానికై యత్నించు రట్టిదియగు
పరమపదమును నెఱిగింతు పార్థ వినుము 278

ఇంద్రియములను నరికట్టి యెవడు మనసు
హృదయమందున నెలకొల్పి ముదముతోడ
బ్రహ్మరంధ్రమునందున ప్రాణముంచి
ఆత్మచింతన జేయుచు ననవరతము 279

బ్రహ్మవాచకమగుచును బరగునట్టి
"ఓం"యనెడు అక్షరంబును నుచ్చరించి
మదిని చింతించుచును నన్ను మరణమొందు
నతడు నాలోన జేరును హితముగాను

ఎడతెగక నన్ను నిరతము దృఢముగాను
స్మరణజేసెడువారలు మరణమొందు
నంత ననుజేరు నెనుచును సంతసమున
ఎఱుగు మర్జున మదిలోన గుఱుతుగాను

నన్ను జింతించి మోక్షముగన్నవారు
మరల జన్మించ రిలలోన మానధనుడ
గనుక నిరతంబు నాయందు మనసు నుంచి
ధ్యానతత్పరుడగుమయ్య ధరణిలోన

బ్రహ్మపర్యంత లోకముల్ బడసియున్న
తిరిగివత్తురు భూమికి మరల వారు
నన్ను జేరెడివారలు యెన్నడైన
తిరిగి జన్మించబోరయ్య ధరణిలోన

వేయి యుగములు బ్రహ్మకు నిలను పగలు
వేయి యుగములు రాత్రించు ధీయుతుండ
నెఱుగువారలు నిరతంబు నెఱుగగలరు
రాత్రి పగలుల భేదంబు ధాత్రిలోన

బ్రహ్మదేవుని పగలు ఆరంభమందు
అన్ని జీవులు అవ్యక్తమందు నుండి
జననమొందును మరలను జనును గాదె
రాత్రియగు కాలమందున ధాత్రి విడిచి

ప్రకృతికంటెను భిన్నమై బరగునదియు
ఉత్తమంబయి యింద్రియ మొత్తములకు
తెలియబడనిది ప్రాణులు యిలను శాప
నాశమొందక నదియుండు దోషరహిత 286

గోచరము కానిదయ్యును గోప్యమైన
నదియు సర్వోత్తమంబని యవని బుధులు
తెలియబల్కుదురో భువి, తెలియుమయ్య
అదియె శ్రేష్ఠంబు, నేనని హర్షమొదవ 287

ప్రాణికోటులు యవనిలో బ్రతుకగలవో
ఎవనిచే జగమంతయు నేలబడునొ
అట్టి పరమాత్ము డెప్పుడు అవనిలోన
భక్తిమార్గముచేతను పట్టుబడును 288

ఎట్టికాలమునందున నిలను విడిచి
పోవువారలు మరలను భువికిరారొ
అట్టికాల విశేషముల్ హర్షమొదవ
తెలియజెప్పెద వినుమయ్య తృప్తితోడ 289

ఉత్తరాయణ కాలమందుర్వి విడచు
బ్రహ్మవేత్తలు మఱిరారు పఱగ భువికి
దక్షిణాయన కాలము ధరణి వీడు
వారు జన్మింతురు మరల నీ వసుధలోన 290

శుక్లపక్షమునందున సుజనయుతులు
తనువు విడిచెడువారలు ధరకురారు
ధరణి కృష్ణపక్షమునందు మరణమొందు
వారు పుట్టెదరవనిలో వరగుణాఢ్య! 291

తపము, దానము, యజ్ఞము, తలప వేద
విజ్ఞతలవల్ల గలిగిన విపులమైన
ఫలముకంటెను హెచ్చైన ఫలము యోగి
పొందునంచును తెలియుము భువిని నీవు

అక్షర పరబ్రహ్మయోగము
ఎనిమిదవ అధ్యాయము సమాప్తము.

శ్రీకృష్ణపరబ్రహ్మణే నమః

# రాజవిద్యా రాజగుహ్య యోగము

## శ్రీకృష్ణుని వాక్యము

ఏది తెలియగబడినచో యిలను అశుభ
రూపమైనది సంసార తాపములను
బాపునట్టిదియగు పరబ్రహ్మ గూర్చి
తెలియజెప్పెద వినుమయ్య కలుషదూర 2

విద్యలన్నిటికంటెను విజ్ఞులవని
మెచ్చునది బ్రహ్మవిద్యయు మిగులగూఢ
మైనదగుచును శ్రేష్ఠమై మదికి ప్రీతి
నిచ్చు విద్యయు తెల్పెద నీకు వినుము. 2

ధర్మమున శ్రద్ధలేనట్టి ధరణి జనులు
నన్ను పొందగలేరని నమ్ముమయ్య
మృత్యురూపము సంసారమిళితమైన
చిక్కులందున బడుదురు చింతతోడ 29

వ్యక్తమును గానిదగుచు నవ్యక్తరూప
మైన నాచేత ప్రాణులు యవని వెలసె
వాటికాధారమగుదును వసుధ నేను
అవియు నాకును నాధార మవవు భువిని 290

ఎటుల వాయువు నిరతంబు నెల్ల దిశల
సంచరించుచున్నదో జగతియందు
అటుల జీవులయన్నియు నలవికాని
నాలో నున్నవి యనుచును నమ్ము పార్థ ! 297

ప్రళయకాలమునందున పరగజీవు
లన్ని నాలోన జేరుచు నణగియుండు
సృష్టికాలమునందున సృష్టిజేయు
వాడననుచును తెలియుము వసుధలోన 298

ప్రకృతి కాధీనమగుచును వసుధలోన
అస్వతంత్రములగు ప్రాణులన్ని నేను
నాదు ప్రకృతిచే మరలను మొదమొప్ప
సృష్టిజేయుచు నుందును చెలువమీర 299

జీవులను సృష్టిజేయుచు భువిని నేను
సాక్షిగానుందు నందుచే జగతిలోని
కర్మసంబంధములచేత కట్టుబడను
ననుచు తెలియుము అర్జునా మనమునందు 300

సాక్షిమాత్రాన నాచేత జగతిలోన
ప్రాణులన్నియు సృజియింపబడుటవలన
జగము జరుగుటవలనను జగతి కంత
సృష్టికర్తను నగుదును స్పష్టముగను 301

సర్వభూత మహేశుడ ! సర్వసాక్షి
నైన, నన్నును, నా తత్త్వ మలవికాని
అల్పులెల్లరు మనుష దేహంబునందు
నున్న నన్నును దూరుచు నున్నవారు 302

వ్యర్థమైనట్టి ఆశలు వ్యర్థమైన
కర్మపరులును, మందులు, కలుషమైన
జ్ఞానవంతులు, సద్బుద్ధి లేనివారు
అసుర భావములంగల్గి యవని వెలయు 303

ప్రాణిహితమును గోరెడు మానవుండు
నాశరహితుడ నైనట్టి నన్ను నెఱిగి
భక్తిభావముతోడుత ముక్తిబడయ
నన్ను ధ్యానించువారలు నన్ను పొందు 304

దైవ పరికృతియు గల్గిన దైవభక్తు
లెల్ల వేళలయందును నిలను నెపుడు
గొలిచి ధ్యానించి కీర్తించి తలచి నన్ను
పొందుచున్నారు ఫల్గుణా ! పుడమిలోన 305

జ్ఞానయజ్ఞమువల్లను జ్ఞానధనులు
ద్వైతభావము విడచు అద్వైతపరులు
ద్వైతభావముగలవారు, తాము తలచు
దైవమని నన్ను దలతురు ధరణిలోన 306

క్రితువు యజ్ఞము పితృదేవ తతికి నొసగు
అన్నమును, ఔషదంబును, అగ్ని నేను
మంత్రమును, హోమకర్మము, మఱి హవిస్సు
నేనెయనుచును దలచుము మానధనుడ ! 307

వాడను, జన్మనిచ్చు
ఫలదాత, తాత, మఱియు
గాంకార పదము, నాల్గు
భువిలోన విభుధవరుడ ! 308

పరమలక్ష్యము భరియించువాఁడ విభుఁడ
సాక్షిమాత్రుఁడ ప్రాణి నివాసమేను
సృష్టి స్థితి లయకర్తను శ్రీకరుండ
బీజరూపమై వెలసెద నీ జగతిని 309

భానురశ్మిచే వృష్ణము బడయుజేతు
వాన కురిపించి మాన్పించువాఁడ నేను
మరణ రహితంబు మరణంబు ధరణి నేను
సదసదుల వస్తురూపమై జగతినుండు 310

వేదవిదులును పాపముల్ విడచువారు
కర్మపరులును యజ్ఞముల్ ధర్మవిధిని
సలిపి నను గొల్చువారలు స్వర్గసుఖము
లందుకొనుచున్న వారలు హర్షమొదవ 311

అట్టివారలు స్వర్గమునందు సుఖము
లనుభవించిన పిమ్మట యవనిలోన
పుట్టి మరలను పోవుచు పుడమినకును
రాకపోకలతో నుండు ప్రాకటముగ 312

ఇతరమగు చింతలెల్లను విడిచిపెట్టి
యెల్లవేళలయందును నుల్లమందు
నన్ను ధ్యానించువారలకున్న కష్ట
ములను తొలగించి రక్షింతు ముదముతోడ 313

ఇతర దేవతారూపముల్ సతతము నను
గొల్చువారలు కూడను కూర్మితోడ
నన్ను గొల్చెడివారని నమ్మి నేను
వారలను కూడ రక్షింతు వసుధలోన 314

యజ్ఞయాగాదులకు నేను నధిపతిగను
నుండుటం జేసి వారలు మెండుగాను
నన్ను తెలియంగ లేక నున్నందువలన
తిరిగి పుట్టుచున్నారు ధరణిలోన

దేవతల గొల్చువారలు దేవతలను
పితృల గొల్చెడువారలు పితృలయందు
భూతముల గొల్చువారలు భూతతతిని
నన్ను గొల్చెడువారలు నన్ను జేరు

భక్తితో పత్రపుష్పము పండు జలము
నాకు నర్పించి మఱియును నన్ను గొలుచు
వారలొసగిన పత్రి పుష్పాదులన్ని
ప్రీతితో తీసుకొందును ఖ్యాతి వెలయ

నీవు సల్పెడు యజ్ఞము నిండు తపము
జపము ధ్యానము భోజన సర్వములను
నాకు నర్పించి మెలగిన నవని నీవు
కర్మ బంధంబులనుచేత కట్టుబడవు

ప్రాణులన్నింట సమముగా బరగనుందు
అందు యిష్టు లయిష్టులు యనుచు లేరు
నన్ను గొల్చెడివారలయందు నేను
వారు నాయందు మన్నారు వసుధలోన

వసుధ నాధారహీనుడై బఱగు జనుడు
నన్ను భజియించునందున యెన్నగాను
నిశ్చయంబగు భక్తితో నిర్మలుడయి
పత్పురుషుడంచు తెలియుము సవ్యసాచి

పాప జన్మముబడసినవారు భువిని
స్త్రీలు వైశ్యులు సూద్రులు చెలువమీర
నన్ను సేవించి ధ్యానించి యెన్నికైన
మోక్షపదమునుగాంతురు ముదముతోడ 321

పుణ్యజనులును భక్తులు పూజ్యులైన
రాజ ఋషులును, ద్విజులు, విభ్రాజితముగ
నన్ను ధ్యానించునందున నన్ను జేరు
నీవు నన్నును గొలువుము నిండు మదిని 322

మనసు నాయందు నిలుపుచు మహితగతిని
నన్ను పూజించి ధ్యానించి నన్ను చిత్త
మందు నిలిపినవాడవై పొందుగాను
జేరెదవు నన్ను ఫల్గుణా చింత విడిచి. 323

## రాజవిద్యా రాజగుహ్య యోగము
## తొమ్మిదవ అధ్యాయము సమాప్తము.

శ్రీకృష్ణపరబ్రహ్మణే నమః

# విభూతి యోగము

## శ్రీకృష్ణుని వాక్యము

పుడమిలోనాదు అవతరములను తలప
దేవతలకును ఋషులకు తెలియబడదు
వారికెల్లను పూర్వుపు వాడనగుట
నా ప్రభావము తెలియదు నరులకిలను

పుట్టుకయు లేనివానిగ పుడమిలోన
నాదిరూపునిగా నన్ను అఖిలలోక
ములనియామకుడననుచు తలచు జ్ఞాని
సకల పాపంబులను వీడు సజ్జనుండు 3

బుద్ధి జ్ఞానము, మోహరాహిత్య, మోర్పు,
సత్యమింద్రియ నిగ్రహ, జన్మములను,
కష్ట సుఖములు తపము, సంతుష్టి, కీర్తి,
మఱియు నపకీర్తి నావల్ల మహిని వెలయు 3

సప్తఋషులును సనకాది సకల మునులు
మనువులెల్లరు, దేవర్షి గణములెల్ల
నాదు సంకల్ప మాత్రాన సాధుహితుడ !
పుట్టిరనుచును తెలియుము పుడమిలోన 32

నా విభూతుల నెల్లను నెవడు భువిని
తెలుసుకొనువాడు శ్రేష్ఠుడు తలపగాను
నిర్మలుండును నగు నన్ను నిశ్చయముగ
నెఱుగువాడను నాతడే వరగుణుండ 32

నా వలన సృష్టి స్థితియును నాశనంబు
జరుగుచున్నది అర్జునా జగతియందు
ననుచు తెలిసిన వారలీ యవనిలోన
నన్ను భజియించుచున్నారు మిన్నగాను 32

నన్ను స్మరియించువారలు నన్ను మదిని
గొలుచువారలు యెల్లరు కూర్మితోడ
ఎల్లవేళల నను గూర్చి యెంతగాను
ముచ్చటించుచు నుందురు ముదముతోడ 330

మనసు నాయందు నిలుపుచు మరల మరల
నన్ను భజియించువారలు నాకు ప్రియులు
ఎందువల్లనను వారు పొందగలరొ
అట్టి జ్ఞానము దెలిపెద నయ్య నీకు 331

## అర్జున వాక్యము

పరమపావనరూపుడ ! బ్రహ్మ నీవు
జన్మరహితుడ ! నిత్యుండ ! శాశ్వతుడవు
నారదాది మునీంద్రులు సరిగ నిన్ను
తెలియునట్లుగ నీవును తెలుపుచుంటి 332

నీవు జెప్పినదంతయు నిజమటంచు
నమ్మినాడను కేశవా నాకు నీదు
దివ్యమైన విభూతులు తేటపడగ
తెలియజెప్పుము మాధవా తృప్తి కలుగ 333

అమృతమయ నీదు వాక్కుల నాలకించ
సంతసము గల్గుచున్నది శౌరి నాకు
దివ్యమగు నీదు లీలలు దేవ నాకు
ఎఱుకబఱచుము శ్రీకృష్ణ గుఱుతుగాను 334

ఎల్లప్రాణుల హృదయాల నెలకుతోడ
ప్రత్యగాత్మయు నైయుందు ప్రాణులందు
ఆది మధ్యాంతములగను యవనిలోన
వెలసియున్నాను యనుచును తలచుమయ్య 335

అరయ నాదిత్యులందున పరగ విష్ణు
దేవతలలో మరచియు, దివ్యమైన
కాంతిగలిగిన సూర్యుండ గగనమందు
చుక్కలందున చంద్రుండ నిక్కువముగ

వేదములయందు గల సామవేద మేను
దేవతలలోన నిందురిండ దేవరుండ
ఇంద్రియములందు మనసును, యెల్ల ప్రాణు
లందు చైతన్యమై యుండు పొందుగాను

రుద్రులందున నే శంకరుండ నగుదు
యక్షరాక్షసులందున నరయ నేను
పరకు బేరుడ నగుదును, వసువులందు
అగ్ని గిరులందు మేరువునగుదు నేను

మతి పురోహితులందున మాన్యుడైన
తరబృహస్పతి, సేనాధిపతుల యందు
సలపనే కుమారస్వామి ధరణిలోన
సరసులందున సంద్రమై బరగువాడ !

చెట్లలో రావిచెట్టును సిద్ధులందు
కపిలముని నేను, ఋషులలో తపసివరుడు
నారదుండను, గంధర్వవరులయందు
చిత్రరథుడను నేనయ్య చెలురమీర !

అరయ ఉచ్చైశ్రివము నేను అశ్వములలో
మనుజులందున రాజును మహిని నేను
తనగ గోవులలో కామధేను వేను
మన్మథుడ నేను నుత్పత్తి మార్గమందు

సర్పములలోన వాసుకి జగతి నేను
నాగులందు ననంతుడ నగుదు నేను
పరగజల దేవతలయందు వరుణుడేను
అర్యమను పితృదేవతులందు నేను 342

దండనము చేయువారిలో దండధరుడ
అసురులందున ప్రహ్లాదుడనెడువాడ !
మృగములందున సింహము, ఖగములందు
నగుదు గరుడుడ, కాలమునగుదు నేను 343

వేగవంతులలో గాలినగుదు నేను
ఆయుధంబులు ధరియించి అవని వెలయు
వారిలో రామచంద్రుడ వసుధ నేను
చేపలందున మొసలిని చెలువమీర 344

ఋషులలో నేను భృగువును యిలను తలప
వాక్కులందున ఓంకార ప్రణవమేను
యజ్ఞములలోనే జపయజ్ఞమగుదు
స్థిరము గలవానిలో హిమగిరిని నేను 345

నదులలో గంగ నగుదును ముదముతోడ
ఆనిమధ్యాంతలయములు నంతనేనె
విద్యలందున ఆధ్యాత్మ విద్య నేను
వాదముల రాగరహితమౌ వాదమేను 346

అక్షరముల అకారము నగుదు నేను
పరసమాజములందున ద్వంద్వమగుదు
నాశనములేని కాలము నగుదు నేను
సర్వముఖముల బ్రహ్మయు జగతి నేను 347

చావుపుట్టుక నేనౌదు జగతిలోన
స్త్రీలకీర్తియు వాక్కును, సిరులు నేను
బుద్ధి ధైర్యము, ఓర్పును శుద్ధమైన
స్మృతియు నేనౌదు అర్జునా చెలువమీర

సామములయందు వరబృహత్సామ మేను
అరయ గాయత్రి చందస్సులందు నేను
మాసముల మార్గశిరమను మాసమేను
ఋతువులందున వెలయు వసంతమేను

వంచనిలయందు జూదంబు వసుధ నేను
పరగ తేజస్వులందున తేజమేను
జయముగాంచెడివారల జయము నేను
సాత్వికుల సత్వగుణమును జగతి నేను 3

వృష్ణివంశీయులందున కృష్ణుడుగను
పాండవులయందు గాండీవి పరగ నేను
మునులలో వ్యాసముని నేను అనగచరిత
కవులయందున శుక్రుడ నగుదునయ్య 3

అన్ని ప్రాణులకెద్దియు నవనిలోన
మూలమై యున్నదో యట్టి మూలమేను
స్థావరంబులు జగముల్ జగతిలోన
లేవు నాకంటె వేరుగా ధీవరుండ ! 3

దివ్యమైనట్టి నా యొక్క దీప్తిజెందు
వరవిభూతులకంతయు వసుధలోన
కాంతివంతము ఐశ్వర్యవంతమగుచు
వెలయునవి యన్ని నా యంశముగను కనుము 35

విభూతి యోగము
పదవ అధ్యాయము సమాప్తము

శ్రీకృష్ణపరబ్రహ్మణే నమః

# విశ్వరూప సందర్శన యోగము

## అర్జున వాక్యము :

నన్ను కరుణించి కేశవా! నాకు నీవు
బోధచేసిన ఆధ్యాత్మ బోధవలన
నాదు అజ్ఞానమును బోయి నాదు మదికి
సంతసంబును గల్గెను సదయ హృదయ 354

నీవుజెప్పినదంతయు నిండుమదిని
విశ్వసించితి కేశవా! వేడుకలర
నీవు తలచినచో నాకు నిండు కృపను
నీ స్వరూపము జూపుము నిర్మలాత్మ! 355

వివిధ ఆకారములతోడ వెలయునదియు
పలు విధంబుల రూపముల్ గలుగుదాని
విశ్వమును గాంచనగు నాదు విశ్వరూప
మంతయును గాంచుమనియెను సంతసమున 356

సూర్యచంద్రులు రుద్రులు నార్యమాదులు
వసువులు మరుత్తులను నీవు వాసిగాంచు
అశ్వనీ దేవతల నీవు యవనిలోన
గాంచలేనివి యన్నియు గనము నేదు 357

మాంసమయమగు కనులతో మహిమగొలుపు
నా స్వరూపము నీవు కానంగలేవు
జ్ఞానమయమగు నేత్రముల్ మానధనుడ
నీకు నొసగెద గాంచంగ నీవు నన్ను 358

## సంజయ వాక్యము :

అటుల దెల్పియు కృష్ణుండు అర్జునునకు
విశ్వరూపము జూపెను విభుధవర్య
అనుచు ధృతరాష్ట్రునితోడ ననెను నచట
సంజయుండును తనుగాంచి సమరగతిని 359

పెక్కు ముఖములు, నేత్రముల్ లెక్కలేని
అద్భుతంబులు గలదియు, ఆయుధములు
వస్త్రముల్ ఆభరణములు, విస్తృతముగ
వెలయు రూపముజూపెను వేడుకలర

వేలకొలదిగ సూర్యులు వెలయనింగి
నెట్టికాంతియు గలుగునో యట్టికాంతి
ఒక్కసారిగ వెలయంగ నుర్వినతడు
దివ్యరూపముతోడను తేజరిల్లె

అచ్చెరువునొంది మదిలోన అర్జునుండు
పులకరించిన తనువుతో పుణ్యపురుషు
డైన కేశవునింగాంచి యమితమైన
భక్తితో దండమిడుచును పలికెనిట్లు

## అర్జున వాక్యము

ఎల్లప్రాణులు గనుచుంటి నెల్ల మునుల
సప్తఋషులను బ్రహ్మను, సర్పములను
దేవతల నెల్ల గనుచుంటి తృప్తితోడ
ననుచు చేతులు జోడించె నర్జునుండు

జగతికంతకు ప్రభుడవు నిగమవినుత
నిన్ను సర్వత్ర గనుచుంటి, నీదు కనులు
హస్తములు ఉదరములు సమస్తమైన
ముఖములను గాంచుచుంటిని ముదముతోడ

ఎల్లెడల నిన్ను గనుచుంటి వేదవేద్య
కనులు మిరిమిట్లు గొలిపెడు కాంతితోడ
గదను చక్రము ధరియించి గగనమందు
భానుకాంతితో భాసిలు భవ్యునిగను

అక్షరంబగు బ్రహ్మవు ఆదిపురుష
జగతికంతకు నాధారమగుచు వెలయు
నాశరహితుడ శాశ్వితుడవ్యయుడవు
పుడమి ధర్మము కాపాడు పూజ్యుడవును 366

ఆదిమధ్యాంతరహితుండ అప్రమేయ
సూర్యచంద్రులు కనులుగ శోభిలంగ
నీదు తేజముచేతను నెల్ల జగతి
వెలుగు నొందగజేసెడు విభుడ నీవు ! 367

నేల నింగికి మధ్యను నెల్ల దిశల
నిండియున్నది నీ రూపు దండిగాను
ఇట్టి భయమును గొలిపెడు నీదు రూపు
గనుచు భీతిలుచుండెను గాదె జగము 368

సురలు కొందఱు నీలోన జొఱబడగను
చేతులు ముగిడ్చి కొందఱు భీతిలగను
సిద్ధసాధ్యులు ఋషులును జేరి నిన్ను
గొలుచుచుండిరి జగతికి మేలుగోరి 369

సూర్యచంద్రులు రుద్రులు సురవరులును
యక్షకిన్నెర వరులును అసురవరులు
సిద్ధసాధ్యులు వసువులు చేరి నీదు
రూపమును గాంచుచుండిరి రూఢిగాను 370

బహుముఖంబులు కనులును బాహువులను
తొడలు పాదముల్ కోరలు కడుభయమున
గనుచు భీతిలుచుండిరి మనములందు
నేను కూడను భయపడినాను కృష్ణ ! 371

పెక్కురంగులు, తెఱచెడు పెక్కునోళ్లు
పెక్కురూపులు నేత్రముల్ భీతిగొల్ప
ధైర్యమును శాంతి నశియించె దయను జూపి
నాకు మఱల ప్రసన్నుడ వగుము కృష్ణ ! 372

కౌరవులు భీష్మ ద్రోణులు కర్ణుడాది
వారిసేనలు, మనసేన వడిగ నీదు
నోళ్లనందు ప్రవేశించి నుగ్గుజేయ
బడుచునున్నారు గాంచంగ పరమపురుష ! 373

నదులు సంద్రము జేరెడి చందమునను
మిడతలన్నియు అగ్నిలోబడెడు విధము
జనులు నీనోళ్లలోనికి జనుచు ప్రభువ !
నాశనంబును నగుచుండె నీశ తలప 374

భయము గొలిపెడు రూపుతో బరగ నీవు
ఎవ్వడవు తెల్పగదవయ్య యెఱుగలేక
యున్నవాడను నినుగూర్చి యుర్విలోన
వందనము జేసెదను నీకు వాసుదేవ ! 375

లోకసంహారమును జేయ లోకమందు
వెలసియున్నారు ప్రతిపక్ష వీరవరులు
నీవులేకున్న యుద్ధము నిలిచిపోదు
ధరణిలో వారు బ్రతుకరు ధన్యచరిత 376

కాన సమరముజేయుము మానవవృషభ !
శత్రువుల జంపికీర్తిని సకలమైన
రాజ్యములు పొంది మఱియును పూజ్యమైన
స్వర్గ సుఖములు గొనుమయ్య శౌర్యధనుడ ! 377

## సంజయ వాక్యము :

అర్జునుడు శౌరి పలుకులు నాలకించి
తనువు వణకగ కరములు తడబడంగ
శౌరికిని మ్రొక్కనని తెల్పె సంజయుండు
ముసలి ధృతరాష్ట్రు గనుచును మోదమొదవ 378

## అర్జున వాక్యము

నీదు నామము రూపము నీ మహాత్మ్య
మంతయును గాంచి జనులెల్ల నమితభక్తి
వందనములను జేసిరి వాసుదేవ
భయపడుచు రక్కసులు జనె పరుగు లిడుచు 379

దేవదేవుడవయ్య దివ్యరూప
అక్షరంబగు బ్రహ్మవు యగుటవలన
ఆదిమధ్యాంత లయుడవు అవ్యయుడవు
నగుటచే మ్రొక్కెదరు నిన్ను అఘవినాశ 380

ఆదిదేవుడవీవయ్య సాధుహితుడ
జగతికంతకు నాధారమగుదు వీవు
తెలిసికొనినట్టివాడవు తెలియదగిన
వాడవీవయ్య వసుధలో పరమపురుష 381

వాయు, వగ్నియు, వరుణుడు, పరగయముడు
సూర్యచంద్రులు, బ్రహ్మవు, నార్య నీవె
బ్రహ్మకును తండ్రివగుచును భాసిలు నిను
గొలిచెదను నెల్లవేళల కూర్మితోడ 382

నీదు మహిమను తెలియక నిన్ను నేను
చనువుచేతను పిలిచితి సఖుడవనుచు
యాదవా! కృష్ణ! యని పరిహాసమునకు
నాదు తప్పులు సైరించు సాధుచరిత! 383

జగతినంతను సృష్టించు నిగమ వినుత
పరమపూజ్యుడ ! శ్రేష్ఠుడ ! భవ్యగుణుడ !
గురువు దైవము నీవయ్య వరగుణాఢ్య
కలరెనిను మించువారలు కలుషహరణ !

తనయునులు చేయు తప్పులు తండ్రివలెను
భార్య చేసెడు తప్పులు భర్తవలెను
సఖులు జేసెడి తప్పులు సఖునివలెను
నాదు తప్పులు సైరించు సాధుహృదయ !

మునుపు నెవ్వడు గనలేని గణుతికెక్క
నీదు విశ్వరూపముగంటి నిండుమదిని
భయముగలుగుచు నున్నది ప్రభువ నీదు
ముందురూపము జూపుము పుణ్యచరిత

## శ్రీకృష్ణుని వాక్యము

ఇంతవరకెవ్వరును నాదు విశ్వరూప
మవనిగాంచగ లేరైరి హర్షమొదవ
నీవుగంటివి నావల్ల నిండుమదిని
విశ్వసించుచు నను నమ్ము వీరవరుడ !

తపము యజ్ఞము దానము లపని సలిపి
వేదముల నభ్యసించియు విభుదవరుడ
ఇట్టి నా విశ్వరూపంబు నింతవరకు
నెవరు కాంచంగ లేరైరి భువిని తలప

భయముగొల్చెడు నా రూపు ధీయుతుండ
గనుచు భీతిని జెందకు మనమునందు
మునుపు రూపము జూపెద మోదమలర
గాంచి సంతసమొందుము ద్రుంచి భయము

## సంజయ వాక్యము :

అటుల దెల్పియు కృష్ణుడు అర్జునునకు
మునుపు రూపము జూపెను మోదమలర
అనుచు ధృతరాష్ట్రునకు దెల్పె వినయమునను
సంజయుండును మదిలోన శౌరి గొలిచి 390

## అర్జున వాక్యము :

నీ మనుజ రూపముంగని కోమలాంగ
ధైర్యమొందితినని దెల్పి దండమిడెడు
అర్జునుం గాంచి, సురలును, అవ్యయుండ
నైన నను జూడ దలతురు యనెను హరియ 391

దివ్యమును అపరిమేయము భవ్యమైన
నా స్వరూపంబు గాంచంగ నలవిగాను
భక్తిమార్గము నొక్కటె ముక్తినొసగు
నాదు రూపంబు గాంచంగ నలవియగును 392

ఎవడు కర్మలు సలుపునో నెల్ల విధుల
నన్ను పొందంగ గోరియు సన్నుతాంగ
మమత, ద్వేషము, విడనాడి మదిని నెపుడు
భక్తితో గొల్చువారలు బడయు నన్ను 393

విశ్వరూప సందర్శన యోగము
పదునొకండవ అధ్యాయము సమాప్తము

శ్రీకృష్ణపరబ్రహ్మణే నమః

# భక్తి యోగము

## అర్జున వాక్యము :

భక్తితో నన్ను గొల్చెడు భవ్యులందు
అక్షరుండవు యనిగొల్చు ఆర్యులందు
ఎవరు యోగము బాగుగా నెఱుగువారొ
తెలియజెప్పుము కేశవా ! తేటపడగ

## శ్రీకృష్ణుని వాక్యము

ఎవరు నాయందు భక్తితో నెల్లపుడును
నన్ను ధ్యానించుచున్నారొ మిన్నగాను
వారె యుత్తమ యోగులీవసుధలోన
అనుచు తెలియుము అర్జునా మనమునందు

ఇంద్రియంబుల నన్నింటి నిగ్రహించి
ప్రాణిహితమును గోరుచు పరగ భువిని
ఇట్టిదని తెల్పరానిది యేది కలదొ
దానినిన్ గొల్చువారలు ధన్యులయ్య !

నిత్యమై సత్యమైనది నిర్వికార
మైన దగుచును నవ్యయ మగుచునుండు
అక్షర బ్రహ్మమును గొల్చు ఆర్యజనులు
నన్ను పొందెదరంచును నమ్ము పార్థ ! 3

సగుణ నిర్గుణ పూజలు జగతిలోన
రెండు విధముల నేర్పడి యుండెనయ్య
అందు నిర్గుణ మార్గము నలవికాదు
తనువుపై భ్రాంతిగలిగిన మనుజులకును

కర్మలను నాకు నర్పించి కడుముదమున
చిత్తమందున నను జేర్చి చింతవిడచి
భక్తితో గొల్చువారలు ముక్తినొసగు
పరమపదమును గనుదురు భవ్యగుణుడ ! 399

స్థిరముగా నిల్పి నన్ను నీ చిత్తమందు
బుద్ధి నాయందు నిరతంబు పొందుపఱచి
నన్ను ధ్యానంబు జేసిన యెన్నికైన
బ్రహ్మపదమును గొనెదవు బహుముదమున 400

అటుల సాధ్యము గానిచో నవని నీకు
అభ్యసించుచు పొందుము అట్టి సుగతి
అట్లు కూడను చేయలేనందువేని
కర్మలను నాకు నర్పించి గనుము సుఖము 401

పరగ నభ్యాస మార్గము బడయుకంటె
జ్ఞానమార్గము శ్రేష్ఠము, దానికంటె
ధ్యానమన్నది గొప్పది, దానికంటె
కర్మఫలమును విడిచిన కర్మమేలు 402

ప్రాణులందున ద్వేషము లేనివాడు
మైత్రి కరుణయు గలవాడు, మనసునందు
సుఖము, దుఃఖము సమముగా జూచువాడు
అహము మమతలు విడువాడు నవని ఘనుడు 403

ఓర్పు సంతుష్టి గలిగిన యోగివరుడు
మనసు బుద్ధియు చిత్తము అనవరతము
నాకు నర్పించి భక్తితో నన్ను గొలుచు
వాడు నాకును యిష్టుడే వసుధలోన 404

ఎవనివల్లను భయమును భువినిగొనడొ
క్రోధ సంతోష భయములు కూడ విడిచి
వ్యాకులత లేనివాడును నట్టివాడు
నాకు యిష్టుడు జగతిలో ప్రాకటముగ

కోరికలు లేనివాడును ధీరవరుడు
పైన లోనను శుద్ధియు బడయువాడు
కార్యకర్త, తటస్థుడు, కామ్యములను
విడచువాడును యిష్టుడై వెలయు నాకు

శతృమిత్రుల సమముగా జరుపువాడు
సుఖము దుఃఖము నొకరీతి జూచువాడు
కలిమిలేములు సమముగా దలచువాడు
నాకు ప్రియుడంచు దలచుము ప్రాకటముగ

దేనియందును ప్రీతిని లేనివాడు
స్తుతుల నిందల సమముగా జూచువాడు
మౌనభావము తోడుత మసలువాడు
తలప నా కిష్టుడయ్యె యిద్ధరణిలోన

నిత్య సంతుష్టు డగుచును నియమితమగు
వాసమును లేనివాడుచు వసుధలోన
బుద్ధిమంతుడు, భక్తియు, శ్రద్ధగలుగు
జ్ఞాని యిష్టుడు నాకయ్యె జగతిలోన

భక్తితో నన్ను నిరతంబు భజనచేసి
నా సుబోధలు పాటించి నన్ను నెపుడు
నుల్లమందున స్మరియించుచున్న వాడు
నాకు నత్యంత యిష్టులు ప్రాకటముగ

భక్తి యోగము
పండ్రెండవ అధ్యాయము సమాప్తము.

4

శ్రీకృష్ణ పరబ్రహ్మణే నమః

# క్షేత్ర క్షేత్రజ్ఞ విభాగ యోగము

## అర్జున వాక్యము

ప్రకృతి పురుషుని గూర్చియు పరమ పురుష
క్షేత్రక్షేత్రజ్ఞులను గూర్చి చెలిమితోడ
జ్ఞానజ్ఞేయంబులను గూర్చి జ్ఞానధనుడ
తెలియజేయుము మదికిని తృప్తిగలుగ 411

## శ్రీకృష్ణుని వాక్యము

తనువు క్షేత్రము యనబడు, తనువుగూర్చి
తెలుసుకొనువాడు క్షేత్రజ్ఞుడిలను తలప
అనుచు క్షేత్రక్షేత్రజ్ఞులు యందురనుచు
నెఱుకపఱచెను కృష్ణుడు గుఱుతుగాను 412

దేహములయందు వెలయుచు దీప్తినొందు
నన్ను క్షేత్రజ్ఞుడనుచును నమ్ముమయ్య
క్షేత్రక్షేత్రజ్ఞులను గూర్చి చెప్పునట్టి
జ్ఞానమే నిశ్చయంబగు జ్ఞానమయ్య 413

భువిని క్షేత్రము యెట్టుల పుట్టెనదియు
ఎట్టి గుణములు కలదియు నెట్టులుండు
ఎట్టివాడును క్షేత్రజ్ఞు డెట్టులుండు
నీకు దెలిపెద వినుమయ్య నిందుమదిని 414

పంచభూతాత్మకంబయి బఱగునదియు
ఇంద్రియంబులు బుద్ధియు యింద్రియముల
వలన గల్గు వికారముల్ గల తనువును
క్షేత్రమనుచును తెలియుము ధాత్రిలోన 415

పొగడుకొనకుండ తనను తా పుడమిలోన
ప్రాణులను హింసచేయక మానధనుడ !
ఓర్పు , ఋజువర్తనంబును, నేర్పు తోడ
మనసు నిగ్రహ మొనరించి మనగ వలయు

ఇంద్రియ వికారముల నెల్ల విడిచిపెట్టి
భార్యబిడ్డలు యిల్లుపై భ్రాంతి విడిచి
జనన మరణము ముదిమియు సకల రోగ
బాధల తలంచి మెలగుము భవ్యగుణుడ !

కష్టసుఖములు సమముగా గనెడివాని
నిశ్చలంబగు భక్తితో నెగడు వాని
జనములందున ప్రీతిని గననివాని
ఆత్మనిష్టుని, జ్ఞానని యందురయ్య !

సత్తుయని అసత్తని జగతి వెలయు
ఏది బ్రహ్మస్వరూపమో సాధుహృదయ !
దానిగూర్చియు తెల్పెద మానధనుడ !
శ్రద్ధ గలిగియు వినుము సద్బుద్ధియుతుడ ! 4

అంతటను కాళ్లు చేతులు అవనియంత
కనులు ముఖములు తలలును కర్ణములను
గలిగి జగమంతయు వ్యాపించి తెలియబడని
దానినే బ్రహ్మమందురు తాపసులును 42

ఇంద్రియంబులు లేనిది యింద్రియముల
గుణములను తెల్పజేసెడు గుణముగలది
అంతటను నిండియున్నది అంటనిదియు
పైనఁ లోపల గలదియు ప్రాణులకును 42

అణువుకంటెను నణువయి యవని వెలసి
జీవి జన్మకు లయముకు జీవమునకు
సూర్యచంద్రాగ్నులవనిలో శోభిలుటకు
కారణంబెద్ది యద్దియే పరగ బ్రహ్మ 422

జ్ఞానరూపమునైనది, జ్ఞానగుణము
వలన తెలియంగ బడునది ప్రాణియొక్క
హృదయమున నిండియున్నది బుధులవల్ల
తెలియబడునది బ్రహ్మంబు ధీరచరిత 423

ప్రకృతి పురుషులు యిరువురు పరగభువిని
పుట్టుకయు లేనివారని బుధులనెదరు
ప్రకృతివల్ల జనించిన వికృతమైన
ఇంద్రియ వికారముల నెల్ల విడువవలయు 424

కార్యకారణ సంబంధ కారణముల
ప్రకృతి హేతువు యనుచును పరిగణించు
కష్టసుఖములవల్లను కలిగినట్టి
ఫలితములు పొందు జీవుడు పరగ భువిని 425

తనువులో నాత్మ యున్నను, తనువుకంటె
వేఱుగా సాక్షిగా నుండి ధీరవరుడ
అనుమతించి ధరించియు యనుభవించి
పరమ ప్రభువుగ వెలసెను గుఱుతుగాను 426

ప్రకృతి పురుషుల నెఱిగిన వరగుణుండు
ఎట్టులున్నను నే రీతి మెలగుచున్న
ధరణి జన్మించబోడని తలచుమయ్య
అనుచు కృష్ణుడు తెల్పెను అర్జునునకు 427

శుద్ధ మనసుచే కొందఱు సూరి జనులు
ధ్యానయోగముచే నన్ను మనములందు
కాంచుచుండిరి సాంఖ్యులు, కర్మ పరులు
తెలుసుకొందురు వారలు తలచినట్లు 428

ధరణి ధ్యానము, సాంఖ్యము, తలప కర్మ
యోగములవల్ల కనలేని యుర్వి జనులు
శ్రవణ తత్పరులైనట్టి జనులు నన్ను
కొలిచి చేరుదురనుచు తలచుమయ్య 429

జగతి జన్మించు స్థావర జంగమములు
తలప క్షేత్ర క్షేత్రజ్ఞులు కలియునందు
వలన వెలసియు నున్నవి వసుధలోన
ననుచు తెలియుము ఫల్గుణా మనము నందు 430

అన్ని ప్రాణులయందును ఆత్మ వెలసి
యున్నదంచు నెఱింగియు నుర్విలోన
దేహనశియించు నాత్మయు స్థిరమటంచు
తెలియువాడును విజ్ఞుండు తలప భువిని 431

అన్ని జీవులలో నున్న ఆత్మ కూడా
తనలో నున్నది ఒకటని తలచి నరుడు
ప్రాణులను హింసచేయక పరమపదము
నొందు ననుచును తెలియుము పొందుగాను 432

కర్మలన్నియు ప్రకృతిచే కలుగునన్నియు
ఆత్మ కర్తయు కాదని యవని నెవరు
తెలుసుకొందురో వారలు తెలియగలరు
నన్ను నిజముగ ననుచును నమ్ముమయ్య 433

వేఱువేఱుగ భూతముల్ వెలసియుండి
ఒక్క పరమాత్మయందును నున్నవనుచు
దానినుండియె వ్యాపించె ధరణిలోన
వెలసె ననుచును తలచును విభుదవరుడు 434

అది లేనట్టివాడును నగుటచేత
గుణరహితుడగుటవలనన్ గోప్యముగను
తనువునందున నున్నను తనువునకును
అంటబడకను నున్నాడు అని తెలియుము 435

ఆకసమునంత వెలసివ యవని ధూళి
ఎటుల దివికిని నంటదో ఆటుల ఆత్మ
తనువునందున నున్నను తనువునకును
అంటబడకయు నున్నది యని తలంచు 436

సూర్యుడొక్కడె జగముకు సూటిగాను
వెలుగు నిచ్చెడు విధమున తలప క్షేత్ర
ములను వెలిగించు క్షేత్రజ్ఞుడిలను ననుచు
తెలియు మర్జున నీవు భూతలమునందు 437

క్షేత్రక్షేత్రజ్ఞ బేధముల్ ధాత్రిలోన
నెఱిగి ముక్తిని సాధించు పరమ విధ్య
తెలుసుకొనువాడు పుణ్యుండు పుడమిలోన
అతడు పరమాత్మ జేరును హర్ష మొదవ 438

క్షేత్ర క్షేత్రజ్ఞ విభాగ యోగము
పదమూడవ అధ్యాయము సమాప్తము

శ్రీకృష్ణపరబ్రహ్మణే నమః

# గుణత్రయ విభాగ యోగము

## శ్రీకృష్ణుని వాక్యము

జ్ఞానములకెల్ల నుత్తమ జ్ఞానమైన
నేది సంసారబంధములెల్ల విడువ
జేయునది యగు జ్ఞానము ధీయుతుండ
దాని నెఱిగింతు వినుమయ్య మానధనుడ! 439

ఇట్టి జ్ఞానము తెలిసిన యెల్ల జనులు
జనన మరణముల్ లేకను జగతి వెలయు
దేవదేవుంతనగు నాదు దివ్యపథము
జేరుతురటంచు నమ్ముము చింతవిడిచి 440

సర్వ భూతము లుత్పత్తి జరుగచేయు
గొప్పదగు నాదు మాయచే గోప్యముగను
గర్భ కారణ బీజమున గర్భమందు
నిడెద సృష్టిని జరుపంగ నిశ్చయించి 441

సృష్టిలో నుద్భవించెడు జీవతతికి
మాతృమూర్తిగ ప్రకృతియు మహిని వెలయు
బీజముంచెడు తండ్రినై తేజమొప్ప
బరగుచుందును అర్జునా భవ్యగుణుడ! 442

ప్రకృతివలన జనించిన త్రిగుణములను
నాశరహితుడై వెలసిన నాత్మ నెపుడు
తనువునందున బంధించి ధరణిలోన
వెలయుచున్నవి యెంతయు వేడుకలర 443

మూడు గుణములయందున ముఖ్యమైన
సత్వ గుణమను గుణము యీ జగతిలోన
నిర్మలంబయి సుఖమిచ్చి నిఖిలజీవ
తతిని బంధించుచున్నది ధరణిలోన 444

గుణములందు రజోగుణమనెడు గుణము
దృశ్యములయందు ప్రీతియు తృష్ణగలుగ
జేసి బంధించుచున్నది జీవతతిని
భువిని యనుచును తెలియుము బుధజనుండ ! 445

ధర తమోగుణము వలన గుఱుతుగాను
మఱపు సోమరితనమును మహిని నిద్ర
కలుగజేసియు జీవిని తలప భువిని
బంధనము జేయుచున్నది భవ్యగుణుఁడ ! 446

సాత్వికంబగు సుఖముచే జగతిలోన
ధర రజోగుణ కర్మచే గుఱుతుగాను
తమముచే జ్ఞానమంతయు తనువు వీడి
జీవి బంధింపబడుచుండె చింతతోడ 447

సత్వగుణమును వెలయ రాజసము తామ
సములు నణగు, రాజసము నంతరించ
తమము సత్వము నణుగును, తమము వెలయ
రాజసంబును సత్వము తేజముడుగు 448

ఇంద్రియములకు నెల్లను వెలుగు నొసగు
జ్ఞానమెప్పుడు గలుగునో మానధనుఁడ
అపుడు సాత్విక గుణమును నతనిలోన
నెలకొనంచును తలచుము విభుదవరుడ ! 449

మనసునందున శాంతిని గననివాడు
లోభగుణములచేత పరిలోభపడుచు
కామ్యములతోడ సంతృప్తిగనెడువాడు
రాజస గుణంబుతోడను తేజరిలును 450

తమము వృద్ధియు గలుగంగ ధరణిజనులు
సోమరత్వ మజాగ్రత్త చొఱవులేక
మందమతితోడ నుందురు మహిని తలప
ననుచు తెలియుము అర్జునా మనమునందు 451

సాత్వికంబగు గుణముతో జగతిలోన
మరణమొందిన నాతడు ధరణి విడిచి
శుద్ధమైనట్టి లోకము సూటిగాను
జేరుదురు యంచు తెలియుము ధీరచరిత ! 452

మరణమొందు రజోగుణ మనుజు లవని
కర్మపరులింట్ల జనియింతురి గాదె తలప
ధర తమోగుణయుతులును మరణమొంది
నీచజన్మలు గాంతురు నిశ్చయముగ 453

సాత్వికంబగు కర్మచే జగతి సుఖము
రాజసముచేత దుఃఖము తేజముడుగు
తమమువల్లను భ్రమయును ధరణిమఱుపు
కలుగునంచును అర్జునా తెలియుమయ్య 454

కర్తగుణములే యనుచును కడకు తాను
గుణములనుకంటె వేరని మనమునందు
తలచి నిరతము నను మది గొలుచువాడు
నన్ను జేరును ననుచును నమ్ముమయ్య ! 455

మూడు గుణములు గెలిచిన బుధజనుండు
జనన మరణము దుఃఖము గనడు భువిని
ముదిమిబాధలు లేకను సదయుడగుచు
సంతసముజెంది పోవును స్వర్గమునకు 456

## అర్జున వాక్యము

మూడు గుణములు దాటిన మునివరుండు
ఎట్టి వర్తనగలవాడు, యెట్టులుండు
ఎటుల గుణములు గెలుచును దిటవుగాను
తెలియజెప్పుము కేశవా! తేటపడగ! 457

## శ్రీకృష్ణుని వాక్యము

సత్వగుణముచే గల్గిన జగతి సుఖము
రాజసమువల్ల గల్గిన తేజమైన
కార్యములను తమమువల్ల గలుగు భ్రిమలు
మదిని తలచనివారలు మాన్యులయ్య! 458

సుఖము దుఃఖము సమముగా జూచువాడు
మట్టి బంగార మొకటిగా మదిని దలచి
ఆత్మరతుడయి, ధీరుడై యవని వెలయు
నతడు గుణరహితుండని యందురయ్య! 459

తీవ్రిమగు భక్తిగలిగియు తృప్తినొంది
నన్ను ధ్యానించి నిరతము నన్ను గొలిచి
వెలయు నాతడు గుణములు విడిచి మదిని
నన్ను జేరును ననుచును నమ్ముమయ్య! 460

గుణత్రయ విభాగ యోగము
పదునాల్గువ అధ్యాయము సమాప్తము

శ్రీకృష్ణ పరబ్రహ్మణే నమః

# పురుషోత్తమ ప్రాప్తి యోగము

## శ్రీకృష్ణుని వాక్యము :

వేదములు ఆకులగుచును, వేళ్లుపైన
క్రింద కొమ్మలుగలదియు, పొందుగాను
వెలయు సంసార మశ్వత్థ వృక్షగతిని
తెలియువారలు విజ్ఞులు తలప భువిని 461

గుణములను శాఖలుంగల్గి గుఱుతుగాను
చిగురులను విషయంబులు జేర పృథ్వి
భువిని వెలసిన అశ్వత్థ భూరుహంబు
దివికి వ్యాపించియున్నది దృఢముగాను 462

అట్టి సంసార వృక్షము ఆదిమధ్య
తుదలు కన్పించకున్నవి విదితముగను
నఱికివేయుము దానిని గుఱుతుగాన
సంగమను ఆయుధంబున శౌర్యధనుడ ! 463

అటుల నఱికిన పిమ్మట దిటవుగాను
నన్ను ధ్యానించి నిరతము నాదు మాయ
విడిచి ననుజేరు ననుచును దృఢముగాను
మదిని నమ్ముము అర్జునా మాన్యగుణుడ ! 464

అహము మమకార వర్జితుడైనవాడు
దృశ్య సంగము విడిచెడు ధీరవరుడు
సుఖము దుఃఖము సమముగా జూచువాడు
బ్రహ్మనిష్ఠుండు పొందును బ్రహ్మపథము 465

సూర్యచంద్రులు అగ్నిచే సుంతయైన
శోభిలంగను లేనిది సుజనవర్య
ఏది కలదట్టి పరమాత్మ నెవరు గనునో
అట్టివారలు మఱిరారు యవనిలోకి 466

నాదు యంశము జీవుడై మోదమొప్ప
కండ్లు ముక్కును చెవులును కడకు తనువు
జిహ్వలందున వెలయుచు చెలిమితోడ
ఇంద్రియంబుల దీప్తిని నొందజేయు 467

పుష్పమందలి వాసన పుడమిలోని
గాలి యెట్టులగొనిపోవు లీలగాను
అటులె యింద్రియ విషయముల్ అవని విడచు
నప్పుడు గొనిపోవు తనతోడ నతిముదమున 468

చెవిని కంటిని ముక్కును చెలిమితోడ
నాలుకను చర్మమందును లీలగాను
మనసునందును జేరుచు మహితగతిని
అనుభవించును జీవుడు ఘనముగాను 469

అరయ అజ్ఞానులెవ్వరు ధరణిలోన
తెలుసుకొనలేరు జీవుని తేటపడగ
జ్ఞానదృష్టిని గలుగు విజ్ఞానధనులు
నెఱుగు జీవాత్మ తమలోన గుఱుతుగాను 470

ఆత్మసాక్షాత్కారము గోరు ఆర్యజనులు
గాంచెదరు ఆత్మ తమలోన కడుముదమున
ఆత్మ గనగ దలంచిన యవని జనులు
మనసు శుద్ధియు లేకున్న కనగలేరు 471

సూర్యునందలి తేజము సూటిగాను
చంద్రునందలి తేజము జగతిలోన
అగ్నియందలి తేజము యవనిలోన
నాదియనుచును తెలియుము సాధుహితుడ! 472

భూమియందున నేనుండి భువిని వెలయు
ప్రాణుల భరించుచున్నాను భవ్యగుణుడ
చందురునందున నేనుండి సస్యములను
నేనె పోషించుచున్నాను నిశ్చయముగ 473

తనువులో జఠరాగ్నినై తనరి నేను
ప్రాణవాయువు మఱియు నపానములతో
పచనమును జేతు నన్నము పరమ కృపను
ననుచు తెలియుము అర్జునా మనమునందు 474

ఎల్ల ప్రాణుల హృదయాల వెలసియుండి
ప్రాణులకు జ్ఞాపకంబును, జ్ఞానమునను
మఱుపు గలిగించుచున్నాను గుఱుతుగాను
వేదవిదుడను వేనయ్య విశ్వమందు 475

క్షరుడ అక్షరుడంచును జగతిలోన
పురుష లిర్వురు గలరయ్య పొందుగాను
క్షరుడ దేహమటంచు నక్షరుడ జీవు
డనుచు తెలియంగ నగునయ్య యవనిలోన 476

ఎవడు ముల్లోకములయందు వెలసియుండు
జగము సృష్టించి పోషించి సంహరించు
నట్టివాడును, అవ్యయుండాది పురుషు
డైన వానిని పరమాత్మ యని నెఱుందు 477

క్షరము దేహము మఱియు అక్షరము జీవు
డగుచు వెలసెను భువిలోన యని తలచుము
వాటికంటెను శ్రేష్ఠుడై బరగినట్టి
దానిగా నన్ను దలతురు వసుధ మునులు 478

అందువల్లన వేదములందు నేను
పరమ పురుషునిగా చెప్ప బడుచునుంటి
అట్టి నాయందు భక్తితో ననవరతము
గొలుచువారలు ననుజేరు కూర్మి తోడ 479

పాపరహితుడవగుచును వసుధ వెలయు
అర్జునా నీకు దెలిపితి నార్తి తొలగ
గోప్యమగు నాత్మ విద్యను గుఱుతుగాను
దాని నెఱిగియు వర్తించు ధరణిలోన 480

పురుషోత్తమప్రాప్తి యోగము
పదిహేనవ అధ్యాయము సమాప్తము.

శ్రీకృష్ణపరబ్రహ్మణే నమః

# దైవాసుర సంపద్విభాగ యోగము

భయము విడచుట జ్ఞానము పరగబాహ్య
అంతరేంద్రియ నిగ్రహ మవని తపసు
వేదపఠనము, యజ్ఞము, భూతదయయు
దైవగుణములు యనుచును దలచు పలయు 481

శాంతి, ఋజువర్తనంబును, సత్యనిరతి
కొండెములు చెప్పకుండుట, గుండెదిటవు
విషయవాంచలు విడచుట, విజ్ఞతయును
దైవగుణములయందురు తాపసులును 482

ప్రతిభ, ఓర్పును, ధర్మంబు, బాహ్యశుద్ధి
అంతరంబున శుద్ధియు, త్యాగబుద్ధి
అతిశయంబును విడచుట, ఆత్మనిరతి
దైవగుణములు యందురు ధరణిలోన 483

దురభిమానము, గర్వము, దుష్టబుద్ధి
కోపమును, డంబమునుగల్గి, కుటిలమైన
నీచబుద్ధులు గలవారు, నిశ్చయముగ
అసురగుణములు గలవారలందు రవని 484

వసుధ దైవగుణంబులవలన దొలగు
పరగ సంసారబంధముల్ భవ్యగుణుడ!
అసురగుణములు బంధించు నవని జనులు
గాన దైవగుణములనూ బూనుమయ్య! 485

శుచియు, ధర్మము, సత్యము సూటిగాను
మతియు నాచార మార్గముల్ మదిని విడిచి
వసుధ మెలగును అసుర భావములవారు
అనుచు తెలియుము అర్జునా మనమునందు 486

జగము సత్యము కాదని నిగమములను
ధర్మరహితములనుచును, దైవమెచట
లేడటంచును, కామముతోచ జగము
పుట్టుననుచును తలచును భువినివారు 487

అట్టి నాస్తిక దృష్టితో నల్ప బుద్ధి
గలిగి క్రూరకార్యములను సలిపి మరియు
లోక కంటకులగుచును ప్రకటముగ
వెలయుచుందురు వసుధలో వేడుకలర 488

కామ తత్పరులగుచును భూమిమీద
మదము మత్సర దంబముల్ మదిని వెలయ
నీచవృత్తులు గలిగియు నీతి విడిచి
వసుధ వెలయును అసుర భావములతోడ 489

విషయ చింతలు మదిలోన విడువకుండ
కామభోగంబులనుగొని కలుషమగుచు
ఆశయనుపాశ బంధితుడగుచు నెపుడు
ధర్మ మార్గము విడనాడి ధనము పొందు 490

ధనము పొందితినింకను పొందగలను
శత్రువుల జంపితిని యింక జంపగలను
అనుభవింతను భోగముల్ యవనిలోన
అనుచు తలచెడువారలు అసురగుణులు 491

అహముగలవాడు, మూర్ఖుడు, అల్పగుణుడు
మోహచిత్తుడు, కుటిలుడు, ద్రోహబుద్ధి,
చంచలాత్ముడు, క్రూరుడు, నెంచభువిని
అసుర గుణములు గలవాడు అందురయ్య 492

పుడమిలో తమ్ము తామును పొగడుకొనుట
కామమును, క్రోధలోభముల్, క్రౌర్యములను
వినయహీనత, గర్వము, విషయవాంఛ,
అసుర గుణములు యందురు యవనిలోన 493

అన్ని ప్రాణులయందున నున్న నన్ను
ద్వేషబుద్ధితో జూచెడు నీచమతులు
అశుభ కార్యముల్ చేయుచు నవనిలోన
నీచజన్మలు నొలదును నిశ్చయముగ 494

అసురజన్మలు నొందిన యవని జనులు
మూఢులగుచును వెలయును, ముందు ముందు
నీచ జన్మలనొందుచు దోషులగుచు
నన్ను పొందగ లేరంచు నమ్ముమయ్య 495

కామమును క్రోధలోభముల్ కనగ భువిని
ద్వారములు యంచు తెలియుము నరకమునకు
అట్టి యీ మూడు గుణములు అసురగుణము
లనుచు విడువుము వాటిని ననవరతము 496

నరకమునకు త్రోవలగుచును ధరణి వెలయు
కామ లోభము క్రోధముల్ కడకు విడిచి
తనకు హితమును గలిగించుకొను నరుడు
మోక్షసిద్ధిని పొందును ముదముతోడ 497

ఎవడు శాస్త్రోక్త విధులను భువిని విడిచి
ఇష్టసిద్ధిని మెలగుచు కష్టములను
నిరతమును పొందుచుండియు, నీతి విడిచి
మెలగునాతడు గనలేడు తలపము క్తి 498

ఏది చేయగవలయునో ఏది వలదొ
నిర్ణయించెడు పట్టున నియమమైన
శాస్త్రములచేత దెల్పెడి సరణి మెలగి
కర్మలను చేయుచుండుము ధర్మవిధిని. 499

దైవాసుర సంపద్విభాగ యోగము
పదునారవ అధ్యాయము సమాప్తము

శ్రీకృష్ణ పరబ్రహ్మణే నమః

# శ్రద్ధాత్రియ విభాగ యోగము

## అర్జున వాక్యము

ఎవరు శాస్త్రోక్త విధులను విడిచిపెట్టి
శ్రద్ధతో పూజలొనరించు శాంతమతుల
స్థితియు సత్వరజో తమో గతులలోన
ఏదియై యున్నదో నాకు నెఱుకపఱుపు 500

## శ్రీకృష్ణుని వాక్యము

పూర్వజన్మమువల్లను పొందు శ్రద్ధ
సాత్త్వికము రాజసము తామసములుగాను
వెలయుచున్నది పుడమిని విభుదవరుడ!
వినుము వానిని నెఱిగింతు వేడుకలర 501

సాత్త్వికులు దేవగణముల జగతిలోన
రాజసులు యక్షరాక్షస పూజలవని
తామసులు భూతగణముల ప్రేమతోడ
గొల్చుచుందురు భక్తిని గుఱుతుగాను 502

తనువు శుష్కింపజేయుచు తనువునందు
నున్న నన్నును బాధించి యుర్విలోన
శాస్త్రరాహిత్య కర్మలు సల్పుచుండి
తపము సల్పెడువారలు ధర నసురులు 503

పరగ సత్త్వాది గుణములబట్టి భువిని
జనుల కాహార మిష్టమై జగతి వెలసె
అటులె దానము తపమును యజ్ఞములను
వెలయుచున్నవి ప్రియములై యిలను తలప 504

ఆయురారోగ్య భాగ్యములందజేసి
దేహబలమును బుద్ధికి దీప్తినొసగి
ప్రీతి నొసగెడు పదార్థముల్ ఖ్యాతి వెలయ
సాత్వికాహారమందురు ధాత్రిలోన 505

చేదు పులుపును వుప్పులను మోదమొసగ
వేడిమియు కారములతోడ కూడియుండి
వ్యాకులత్వము గలిగించి దుఃఖమొసగు
నదియె రాజసాహారమై యవని వెలయు 506

వండి నిలవుండి నదియును, వుడకనదియు
పాచిపోయిన దుర్గంధభరితమైన
ఒకరు తినగాను మిగిలియు నుండునదియు
తామసాహార మగుచును ధరణి వెలసె 507

ఫలము కోరని యజ్ఞము తలప భువిని
సాత్త్వికంబని యెఱుగుము శౌర్యధనుడ
ఫలము కోరిన యజ్ఞము వసుధలోన
రాజసంబని యెఱుగుము రాజతనయ! 508

మంత్ర రహితము దక్షిణ మరియు భువిని
అన్నదానములేనిది, అర్ఘ్యపూజ
లేనిదియు శ్రద్ధ బొత్తిగా లేనిదియును
తామసంబగు యజ్ఞమై ధరణి వెలయు 509

పెద్దలను పూజచేయుట శుద్ధి గలిగి
బ్రహ్మచర్యము పాటించి పరగ మదిని
కుటిల భావముల్ విడచుట కపాత్మ తోడ
మెలగ శారీరక తపంబు తలప భువిని 510

ఇతరులకు బాధ కలుగని హితముగల్గు
సత్యవాక్కులు బలుకుట, నిత్యజపము
శాస్త్ర గ్రంథములెపుడును చదువుటయును
వాచకంబగు తపమని వసుధ వెలయు 511

మనసు నిర్మల మొనరించి మౌనముగను
దృశ్య సంకల్పములు వీడి దీక్షతోడ
దేవునింగొల్చునట్టిది ధీవరుంత
వరగ మానస తపమని ధరణి వెలసె 512

వసుధ శారీర మానస వాచకముల
తపములను సాత్త్వికంబని తలపవలెను
ఫలము కోరక వాటిని భక్తవరులు
సలుపునుందురు నిరతంబు సవ్యసాచి 513

గౌరవము కీర్తి బడయంగ ఘనముదాను
సలుపునట్టియు తపము రాజసము ననిరి
ఫలము గోరిన జనులును సలుపుచుండురి
భువిని సంపదల్ పొందంగ బుధజనుంత 514

ఇతరులకు బాధ కల్గించనెంచి మదిని
తనువు శుష్కింపజేసెడు తపము తలప
తామసంబని యెఱుగుము ధరణిలోన
మూర్ఖజనులును చేతురు ముదముతోడ 515

యోగ్యుడైనట్టివానికి నుర్విలోన
పుణ్యకాలమునందున పుణ్యమైన
స్థలమునందున సలిపెడు దాన మవని
సాత్త్వికంబని నెఱుగుము శౌర్యధనుడ ! 516

పఱగ ప్రత్యుపకారము కొఱకుచేయు
దానమును రాజసంబని తలపవలయు
అర్హతయు లేనివారికి అవనిలోన
దానమొసగుట తామస దానమండ్రు 517

తలప "ఓం"యని "తత్"యని దైవమునకు
మఱియు సత్‌యను పేరులు మహిని గలవు
వాని నాధారముంగొని బ్రహ్మవిధులు
వేద నిర్మాణముజేసె సాధుహృదయ ! 518

వేదవిజ్ఞాన మెఱిగిన విబుధవరులు
యజ్ఞ దానతపంబులు యవనిలోన
"ఓం"యను పదము పలుకుచు ధీయుతుండ
సలుపుదురు ప్రీతితోడుత శాస్త్రవిధిని 519

"తత్"యను పదము పలుకుచు ధర్మవిధులు
తపము దానము యజ్ఞముల్ తాము సలిపి
సత్‌యను పదము తెల్పుచు సకల శుభము
లొసగు కర్మలు జేతురు నుర్విలోన 520

తపము దానము హోమము తలప భువిని
శ్రద్ధలేకుండ జేయన సత్తు యనియు
వానివల్లను ఫలములు వసుధలోన
బడయలేమంచు దలచుము భవ్యగుణుడ ! 521

శ్రీద్ధాత్రియ విభాగ యోగము
పదిహేడవ అధ్యాయము సమాప్తము

శ్రీకృష్ణపరబ్రహ్మణే నమః

# మోక్ష సన్న్యాస యోగము

## అర్జున వాక్యము :

పుడమి త్యాగము సన్న్యాసములను యందు
గలిగియున్న యదార్థము తెలియగోరి
నిన్ను ప్రశ్నించుచుంటిని నిర్మలాత్మ !
వేఱువేఱుగ వాటిని నెఱుక జెపుమ ! 522

## శ్రీ కృష్ణుని వాక్యము :

భువిని సన్న్యాస మనగను పుడమిలోన
కామ్యకర్మలు విడచుటగాదె తలప
ఫలము విడిచియు కర్మలు సలుపుటయును
త్యాగమందురు విభుదులు తలప ధరణి 523

కర్మ విడుమని సాంఖ్యము. కర్మయజ్ఞ
తపము, దానముల్ విడుమని ధరణిలోన
కొందఱందురు, తలపగనందు కర్మ
విడుచుటను గూర్చి తెల్పెద విభుదవరుడ 524

యజ్ఞ దాన తపంబులు యువనిలోన
విడుచునట్టివి కావయ్య విమలగుణుడ
బుద్ధిమంతులు జరిపిన భువిని నవియు
చిత్తశుద్ధిని చేకూర్చు చెలిమితోడ 525

శాస్త్రవిహితమై బఱగిన జగతిలోని
కర్మలను చేయవలయును ధర్మవిధుడ
కర్మలదు వీడదలచుటఁగనగ భువిని
తామసత్యాగ మనియును దలప వలయు 526

భయము దుఃఖము శ్రమయును బాధపడుచు
చేయవలసిన కర్మలు చేయకుండ
కర్మలను విడబూనుట కనగ జగతి
రాజస త్యాగమందురు రాజవరుడ ! 527

శాస్త్ర నియమిత కర్మలు జగమునందు
చేయదగినవి యనుచును ధీయుతుండ
ఫలము విడనాడిచేయుట తలప భువిని
సాత్త్విక త్యాగమందురు శౌర్యధనుత 528

సత్వగుణమును, పరిజ్ఞయు, సమరసమును
త్యాగశీలము గల్గిన ధర్మపరులు
శుభము నశుభము నొకరీతి జూచి మదిని
ఫలము విడిచియు కర్మలు సలుపు చుంద్రు 529

ఫలము విడిచియు కర్మలు సలుపువాడు
త్యాగియని చెప్ప బడునయ్య ధరణిలోన
దేహధారి కసాధ్యము తెలియభువిని
పూర్తిగా కర్మలను విడ బూనుకొనుట 530

వసుధ సుఖదుఃఖముల యొక్క ఫలితములను
కష్టసుఖములు గలిగించు కర్మఫలిత
ములను విడనాడువారికి గలుగునయ్య
మరణమొందిన తరువాత గుఱుతుగాను 531

కర్మలన్నియు నెరవేర్చ కర్మకాండ
అంతమును దెల్పు నట్టిది యవనిలోన
సాంఖ్యమున నందు జెప్పెడి శాస్త్రగతులు
సిద్ధి కారణములు విను మాదరమున 532

కర్మ చేయు శరీరము కర్మ చేయు
కర్త వివిధ యింద్రియములు కర్మ క్రియలు
దైవ మును కారణంబని దలచ వలయు
పరగ కర్మలు జేసెడి తరుణమందు 533

మనసు వాక్కు శరీరము మహిని తలప
శాస్త్రవిహితము మఱియును శాస్త్రరహిత
మైనదియుగాని యేదైన నవనిలోన
కర్మకీ యైదు తలపక కారణములు 534

ఎవడు కర్తగా నాత్మను నెంచు మదిని
అట్టి యవివేకి యెఱుగడు యవనిలోన
కర్మ విషయము మఱియును కనక మదిని
ఆత్మ రూపము నెఱుగడు నార్య తలప 535

కర్తగా నన్ను దలచిన ఘనుడు మఱియు
బుద్ధిచే కర్మలంటని బుధజనుండు
జీవులను చంపి నంగాని ధీవరుండ !
అతడు కర్మలచేతను నంటబడడు 536

తెలివి, తెలియదగునదియు, తెలియువాడు
అనుచు మూడు విధంబులు యవని బఱగె
చేయువాడును, క్రియయును, చేయునట్టి
సాధనంబులు మూడని జగతి వెలసె 537

వేఱుబఱచగ లేనిది విశ్వమందు
నేదియున్నదొ తలపగ నాదియైన
ఆత్మ నెఱుగ దలంచిన నట్టిదానిఁ
సాత్త్వికంబని యెఱుగుము సదయ హృదయ ! 538

ఎల్లప్రాణులు యందున వెలసియున్న
జీవులను వేఱువేఱని ధీవరుండ
తలచువారలు పొందెడి ధరణిలోని
జ్ఞానమును రాజసంబని గనుము మదిని 539

ఏదొనొక్క పనిని చేయనెంచి మతియు
అదియె సర్వము యనుచును మదిని దలచు
జ్ఞానమును తామసంబని యనగ నీవు
తెలియదగునయ్య పార్థుడా తేటపడగ 540

శాస్త్రవిహితమైనట్టిది జగతిలోన
ఫలము కోరని ఆసక్తి కలగనదియు
రాగమును ద్వేషమభిమాన రహితమైన
కర్మలను సాత్వికంబగు కర్మలనిరి 544

శక్తికిని మించు కర్మలు సలుపనెంచి
మంచిచెడ్డలు తలచక మహిని నరుడు
చేయు కర్మలవల్లను చేటు గలుగ
జేయునవి తామసంబని చెప్పబడెను 545

నేను కర్తను యనుచును నిండుమదిని
అహము విడనాడి ఫలమున కాశపడక
జరుగకున్నను జరిగిన సమరసమతి
గలుగువాడును సాత్విక కర్తయగును 543

ఫలము నాశించువాడును తలచినట్టి
పనియు నెఱవేర సంతసపడెడువాడు
లేనియెడలను దుఃఖము బూనువాడు
ధరణి రాజసకర్తని తలపవలయు 544

వినయమును లేనివాడవివేకయుతుడు
మనసు గెలువనివాడును మనుజులందు
మోసగాడును, సోమరి, దోషయుతుడు
తలప తామసకర్తని ధరణి బఱగు 545

ధర్మమందు ప్రవృత్తి యధర్మమందు
తగని వృత్తియు గలిగియు తలప ధరణి
చేయదగినది లేనిది చెలిమితోడ
తెలుసుకొను బుద్ధి సాత్త్వికస్థితియనబడు 546

ధరణి ధర్మమధర్మము దలచి మదిని
ఉన్న దున్నట్లుగా కుంత సుత్విలోన
మఱొక విధమున దలచెడు మానవుండు
రాజసంబగు బుద్ధితో తేజరిలును 547

ధర్మము నధర్మమనుచును తలచునదియు
అన్నిటికిని వీరుద్ధమైయవనిలోన
తెలయుబుద్ధిని తామస విధమటంచు
తెలియు మర్జునా మదిలోన తేటపడగ 548

మనసు పాణిముల్ యింద్రియ మార్గములను
యోగసాధన వల్లను బాగుగాను
ఆత్మనందున జేర్చెడి యమలమైన
ధైర్యమును సాత్త్వికంబని దలపవలయు 549

ధర్మ మర్థము కామము దలచిమదిని
వాటి నింపొంద గోరియు వసుధలోన
నరుడు పొందెడు ధైర్యంబు గుఱుతుగాను
రాజసంబని నెఱుగుము తేజమొప్ప 550

భయము, నిద్రియు, దుర్బుద్ధి పరగమదము
మిగుల దుఃఖము మనమున పగను దలచు
ధైర్యమును తామసంబని తలచుమయ్యా
సాధుహితుడగు అర్జునా ! స్వాంతమందు 551

మొదట కష్టముగా నుండి తుదిని సుఖము
గలుగునది సాత్త్వికంబని తలపవలయు
మొదట సుఖమును తుది కష్టములను నొసగు
నదియు రాజసమనుచును విదితమగును 552

నిద్ర సోమరితనముతో పొద్దుబుచ్చు
సుఖము తామసమందురు సుజనహితుడ !
త్రిగుణములు లేని వస్తువు దివిని భువిని
లేదులేదని తలచుము సాధుచరిత ! 553

బ్రాహ్మ క్షత్రియ వైశ్య శూద్రులకు తలప
వేఱువేఱుగ కర్మలు వెలసియుండె
వాటివాటిని దెల్పెద పాటవముగ
విన్నుము అర్జునా యని పల్కె విశ్వవిభుడు 554

సత్యనిరతియు తపసును శాస్త్రమందు
గురువు దైవములందున గుఱుతు గలిగి
ఇంద్రియములు గెలుచుట నెంచగాను
విశుద్ధ బ్రాహ్మణ కర్మలు వరగుచుండ ! 555

ధరణి పాలన కీర్తియు, దానధర్మ
ములను, శౌర్యము, రణమున తొలగకుండ
నుండుటయు రాజధర్మముల్ సుధ్వి లోన
నెన్నుచు తెలియుము అర్జునా మనమువందు 556

వసుధ గోరక్షణంబును వర్తకంబు
వైశ్యధర్మములనుచును వరలె భువిని
సేవయను కర్మ చేయుట ధీవరుండ !
శూద్ర ధర్మము తలపగ సుజనహితుడ ! 559

ఎవనివల్లను ప్రాణులు యెల్లవిధుల
జన్మ నొందుచునున్నవో జగతిలోన
అట్టి పరమాత్మ గొలుతురు అవని జనులు
వారలన్ జేయు కర్మలవల్ల భువిని 560

పరుల కర్మలకంటెను ధరణిలోన
గుణములేనిదియైనను గుణయుతుగాను
తాను సలిపెడు కర్మయు తలప తనకు
శ్రేయమిడునంచు తలచుము ధీయుతుండ ! 559

పరగ స్వాభావికంబయి ధరణి వెలయు
తాను జేసెడి కర్మయు కనగ భువిని
దోషయుక్తము నైనను దూరమునకు
తొలగజేయగ రాదంచు తలచుమయ్య ! 560

విషయ లంపటముల నెల్ల వీడునట్టి
బుద్ధి కలిగియు, మనసును పొందుగాను
గెలిచి కోరికల్ విడుచునో బలయుతుండు
జ్ఞానసిద్ధిని పొందును మానధనుడ ! 561

కర్మసిద్ధిని పొందెడు కర్మయోగి
జ్ఞానసిద్ధిని పొందెడు జ్ఞానధనుడు
ఎటుల పరమాత్మ గనెదరో యెల్ల విధుల
దానిఁదెల్పెద వినుమయ్య ధైర్యగుణుడ ! 562

నిర్మలంబగు బుద్ధితో నిశ్చలుడుగ
మనసు నిగ్రహ మొనరించు మాన్యగుణుడు
విషయరాగముల్ ద్వేషముల్ విడుచువాడు
ఒంటరిగ నున్నవాడును నుత్తముడును 563

మితము గలుగు నాహారము మెసవువాడు
వాక్కు తనువును మనసును వశము జేసు
కొనుచు ధ్యానంబు జేయుచు దనరువాడు
కామమును క్రోధమును వీడు ధీమహితుడు 564

వస్తు సంగ్రహమంతయు వదలువాడు
అహము డంబము మమతయు యిహసుఖములు
విడుచువాడు సమర్థుడు విశ్వమందు
పరమపదమును జేరును భవ్యగుణుడ ! 565

బ్రహ్మరూపము పొందిన బ్రహ్మవిదుడు
నిర్మలంబగు మనసుతో నిండియుండి
కోరికలు దుఃఖములు వీడి ధీరుడగుచు
తనవలెను గాంచు ప్రాణుల ధరణిలోన 566

భక్తిచేతను మనుజుడు పరమపురుష
డైన నన్నును, నా శక్తినంత నెఱిగి
నన్ను ధ్యానించి, పూజించి, నన్ను జేరు
ననుచు తెలియుము అర్జునా మనమునందు 567

బుద్ధియుతుడగు మనుజుడు భూతలమున
కర్మలెల్లను నిష్కామగతిని జరిపి
చిత్తమున నన్ను గొలుచుచు చింతవిడిచి
పరమపదమును బడయును భవ్యగుణుడ ! 568

ఆహవము చేయననుచుసు అహముతోడ
నీవు పలుకుట వ్యర్థము నీతివిదుడ !
నీ స్వభావముచేతను నీవు భువిని
సమరమును జేయతలతువు సవ్యసాచి 569

యంత్రమును యంత్రచోదకు డవనిలోన
నడుపు విధమున దేహిని నడుపుచుండు
నాత్మ తన మాయచేతను ననపరతము
యనుచు తెలియుము అర్జునా మనమునందు 570

హృదయమందున నెలకొను సదయుడైన
పరమపురుషుని శరణంబు భక్తితోడ
తలచి ధ్యానించి నిరతము తలప నతడు
నిన్ను రక్షించి ముక్తియు నీకు నొసగు 571

గోప్యమగుచును బఱగిన గొప్పదైన
జ్ఞానమును నీకు దెల్చితి మానధనుడ !
దీని నెఱిగియు యోచించి దీక్షతోడ
ఆచరించుము అర్జునా యవనిలోన 572

మనసు నాయందు నిలుపుచు మహితగతిని
భక్తితో నన్ను గొల్వుము పాపరహిత
అటుల గొలిచిన అర్జునా యవనిలోన
నాకు నిష్టుడవగుదువు ప్రాకటముగ 573

అన్ని ధర్మములను వీడి అనవరతము
నన్ను శరణంచు వేడిన యెన్నదగిన
సకల పాపంబులను నుండి సత్వరముగ
నీకు ముక్తిని చేకూర్తు నిశ్చయముగ 574

నీకు దెల్పిన బోధలు నిక్కవముగ
వినుట కిష్టము లేనట్టి మనుజులకును
భక్తులునుగానివారికి వసుధ నన్ను
నిందలన్జేయువారలు పొందతగదు 575

ధరణిలో భక్తజనులకు గుఱుతుగాను
ఎవడు గీతను బోధించు భువిని సతడు
నాదు భక్తుడై వెలయుచు సాధుహితుడ
నన్ను జేరుట తథ్యము సన్ను తాంగ 576

ధర్మయుక్తము నగుచును దనరునట్టి
మనల సంభాషణంబును మహితగతిని
అధ్యయనమును జేసెడినట్టివారు
నన్ను గొలిచెడువారని నమ్ముమయ్య 577

శ్రద్ధతో గూడియున్నట్టి సజ్జనుండు
మది నసూయను విడిచియు మఱియు భువిని
గీత చదువుచు వినియెడు నీతిపరుడు
పుణ్యలోకముల్ జేరును పుడమి విడిచి 578

నీదు బోధలవలనను నిర్మలాత్మ
నాదు యజ్ఞానమును పోయె నళిని నేత్ర !
సంధియంబులు తొలగెను శౌరి యికను
నీదు నాజ్ఞలు పాటింతు నిండుమదిని 579

సంజయుండు అంధవిభునితో సమరమందు
అర్జునునితోడ శౌరియు నాదరమున
పలుకు పలుకులు వింటిని పరిభువ యనుచు
తెలియజెప్పెను ముదముతో తేటపడగ 580

స్వభూమిని శౌరియు యోధుడైన
మనకును దెల్పిన నట్టియోగ
నెఱిగితి ముదమున విభుధవరుడ !
రాయణు కృపవల్ల బాగుగాను 581

ంపురుషుని కృష్ణుని భవ్యమైన
రూపముగంటిని వేడుకలర
లదలచుచు దానిని గుఱుతుగాను
ంసము నొందుచుంటిని స్వాంతమందు 582

గివరుడగు కృష్ణుడు యోధుడైన
సుడునుండు తావున అఖిలమైన
ందలు, నీతి, విజయము, శాంతి వెలయు
చు నెఱుగుము అర్జునా యవనిలోన 583

వరదుడ ! కేశవ ! భవనిధూర !
గవిద్యను తెలిపిన యోగివంద్య !
తో నిన్ను గొలిచెద పరమపురుష !
ము కర్పూరహారతి కూర్మితోడ ! 584

## మోక్ష సన్యాసయోగము
## పదునెనిమిదవ అధ్యాయము సమాప్తము.

ఓం తత్ సత్.

# గీతా మహాత్మ్యము

ధరణి ప్రారబ్ధకర్మము తలపనెటుల
తొలగునో తెల్పుమని పృథ్వి పలుకునంత
కేశవుడు తెల్పినట్టి యీ గీతనెవరు
పఠన జేతురొ వారలు బడయు సుఖము 1

నీరు తామరాకును వంటనేరని గతి
గీత పఠియించు వారికి పాతకములు
అంటనేరవు మఱియును అన్ని తీర్ధ
ఫలితములు గల్గునంచును తలచుమీవు 2

ఎచట గీతను పఠియింతు రచట దేవ
గణములును, గోపగోపికల్, మునులు, సురలు
నెల్లవేళన నుందురు నిలను తలప
నేను నచ్చటనుందును మానవధనుడ ! 3

వేదముల సారమగునును వెలయు గీత
పదియు నెనిమిది యాధ్యాయ పఠనమునను
నిత్యమును జేయువారలు సత్యమైన
పరమపురుషుని జేరును భవ్యగుణుడ ! 4

సగము గీతను నిత్యము చదువువారు
బడయు గోదాన ఫలమును కడుముదమున
పరగ మూడవభాగము పఠనజేయ
గంగలో మున్గు ఫలమును గాంచగలరు ! 5

భక్తి నారవ భాగము పఠనజేయు
వారు సోమయాగ ఫలమును బడయగలరు
ఒక్క యాధ్యాయ పఠనంబు నిక్కువముగ
జేయగను రుద్రలోకము జేరగలరు ! 6

పరగ నాధ్యాయ నాల్గవ భాగమెవరు
నిత్యమును భక్తితోడుత నియమ మొప్ప
పఠనజేతురొ భువిలోన వారు మరల
నరులుగా పుట్టుచుందురు ధరణిలోన ! 7

పదియు, ఏడును, ఐదును, ముదముతోడ
మూడు, రెండును, ఒకటియు, పుణ్యధనుడ !
అర్ధ శ్లోకము పఠియించు నతడు గూడ
చంద్రలోకమును జేరును సదయ హృదయ ! 8

మరియు గీతను చదువుచు మరణమొందు
నతడు నుత్తమ మనుజుడై

గీత, గీతా ! యటంచును గీత
అసువులను వీడ స్వర్గము న

గీతయందలి యర్ధము ప్రీతి
వినదలంచిన పాపులు విష్ణుజే
గీతనుం గూర్చి చింతించు
పరమపదమును జేరును భ

గీతను పఠించి తదుపరి గీత
వరమహాత్మ్యము నెవ్వడు
పఠనమొనరింపడో వాని పఠ
వ్యర్థమనుచును తెలియుము

# గీతా మహాత్మ్యము

ధరణి ప్రారబ్ధకర్మము తలపనెటుల
తొలగునో తెల్పు మని పృథ్వి పలుకునంత
కేశవుడు తెల్పినట్టి యీ గీతనెవరు
పఠన జేతురొ వారలు బడయు సుఖము 1

నీరు తామరాకును వంటనేరని గతి
గీత పఠియించు వారికి పాతకములు
అంటనేరవు మఱియును అన్ని తీర్థ
ఫలితములు గల్గునంచును తలచుమీవు 2

ఎచట గీతను పఠియింతు రచట దేవ
గణములును, గోపగోపికల్, మునులు, సురలు
నెల్లవేళన నుందురు నిలను తలప
నేను నచ్చటనుందును మానధనుడ ! 3

వేదముల సారమగునును వెలయు గీత
పదియు నెనిమిది యాధ్యాయ పఠనమునను
నిత్యమును జేయువారలు సత్యమైన
పరమపురుషుని జేరును భవ్యగుణుడ ! 4

సగము గీతను నిత్యము చదువువారు
బడయు గోదాన ఫలమును కడుముదమున
పరగ మూడవభాగము పఠనజేయ
గంగలో మున్గు ఫలమును గాంచగలరు ! 5

భక్తి నారవ భాగము పఠనజేయు
వారు సోమయాగ ఫలమును బడయగలరు
ఒక్క యాధ్యాయ పఠనంబు నిక్కవముగ
జేయగను రుద్రలోకము జేరగలరు ! 6

పరగ నాధ్యాయ నాల్గవ భాగమెవరు
నిత్యమును భక్తితోడుత నియమ మొప్ప
పఠనజేతురొ భువిలోన వారు మరల
నరులుగా పుట్టుచుందురు ధరణిలోన ! 7

పదియు, ఏడును, ఐదును, ముదముతోడ
మూడు, రెండును, ఒకటియు, పుణ్యాధనుడ !
అర్ధ శ్లోకము పఠియించు నతడు గూడ
చంద్రలోకమును జేరును సదయ హృదయ ! 8

మరియు గీతను చదువుచు మరణమొందు
నతడు నుత్తమ మనుజుడై యవని బుట్టు
గీత, గీతా ! యటంచును గీతఁదలచి
అసువులను వీడ స్వర్గము నతడు పొందు ! 9

గీతయందలి యర్థము ప్రీతితోడ
వినదలంచిన పాపులు విష్ణుజేరు
గీతనుం గూర్చి చింతించు నీతివిదులు
పరమపదమును జేరును భవ్యగుణుడ ! 10

గీతను పఠించి తదుపరి గీతయొక్క
వరమహాత్మ్యము నెవ్వడు వసుధలోన
పఠనమొనరింపడో వాని పఠనమంత
వ్యర్థమనుచును తెలియుము వరగుణుండ ! 11

ఇది శ్రీ పరమేశ్వర కరుణా కలిత కవిత్వ
రచనా ధుర్యుండును శ్రీ వత్సవ
గోత్రజుండును, యామనవంశ
సుధార్ణవ సుధాంశుండును
రామమాంబప్రయ
తనూజుండును బస
వయ నామ ప్రణీతంబగు
గీతా స్రవంతి
సమాప్తము.
ఓం తత్ సత్.

